

# బొమ్మరిల్లు

సంపాదకుడు : విజయ బాపినీడు

పురాణకథలు ఎన్నిసార్లు చదివినా తనివి తీరదు. మన పురాణాల్లో శాపాలకు గురయ్యే ఎన్నో విశిష్ఠమైన పాత్రలు మనకు తారసపడుతుంటాయి. అలాంటి పాత్రల కథ నాన్ని ఇకమీదట 'శాపకథలు' అన్న పేరుతో నెల నెలా బొమ్మరిల్లులో చూస్తారు. వీటికి రచయిత శ్రీ బొల్లవరం నారాయణరెడ్డి. ఈయన రచనా శైలిలో పురాణాల్లోని పాత్రలు మరింత హృద్యంగా, మనోహరంగా మనకు దర్శనమిస్తాయి. ఆ విషయాన్ని మీరు 'వేదవతి' అన్న కథలో గమనిస్తారు.

ఈ సంచికనుండి ప్రతినెలా 'తాతయ్య ప్రశ్న—మనవడి జవాబు' శీర్షికను కొత్తపంథాలో శ్రీ అవసరాల రామకృష్ణారావు నిర్వహిస్తారు. విజ్ఞానదాయకమైన ఈ శీర్షిక మిమ్మల్ని ఆకట్టు కుంటుందని ఆశిస్తాం!

సంపుటి :16 ఆగస్టు 1987 సంచిక : 12

విడిప్రతి రూ.2-50 సంవత్సర చందా: రూ.30-00



# నాగాస్త్రం

మహాభారత యుద్ధం ప్రారంభమయ్యాక, పది రోజులు యుద్ధం చేసి భీష్ముడు అంపశయ్యపై ఒరిగాడు.

తర్వాత ద్రోణాచార్యుడు సర్వసైన్యాధిపత్యాన్ని వహించి, పాండవ యోధులతో ఐదురోజులు పోరాడి అసువులు బాసాడు.

అనంతరం దుర్యోధనుడు కర్ణునికి పట్టంకట్టి, సర్వసేనలను ఆధీనంచేశాడు. భీష్ముడు తనను తూలనాడి నందుకు నిరసనగా కర్ణుడు భీష్ముడు పడిపోయేదాకా యుద్ధం చేయనని భీష్మించుకుని, పదిరోజులు మాత్రం యుద్ధంలో పాల్గొనలేదు. ద్రోణసైన్యాధిపత్యంలో యుద్ధం చేశాడు. అటు పిమ్మట తను సేనాపతి అయ్యాక నూతనోత్సాహంతో తనబలాలను పురికొల్పుతూ పాండవ సైన్యాలమీద విరుచుకు పడ్డాడు.

కర్ణుని ధాటికి ఆగలేక పాండవ సైన్యం వెనక్కి మరలింది. భీముడు, ధర్మరాజు, నకులుడు, సహదేవుడు, కర్ణునిచేతిలో పరాజితులై పరాభూతులయ్యారు. ఈటెపోటుల వంటి మాటలతో వాళ్లను తూలనాడి యుద్ధరంగం నుంచి తరిమివేశాడు కర్ణుడు

సాత్యకి, దృష్టద్యుమ్నుడు పాండవ పుత్రులైన వుపపాండవులు, విరాటుడు, ద్రుపదుడు, మొదలైన యోధాను యోధులందరినీ కర్ణుడు సమరభూమినుంచి పారద్రోలాడు.

కకావికలై పారిపోతున్న పాండవ సైన్యాలను కర్ణుని చేత ప్రేరేపించబడిన కౌరవ సైన్యాలు సింహనాదాలు చేస్తూ తరమటం ప్రారంభించాయి.

దూరాన సంశప్తకులతో యుద్ధం చేస్తోన్న అర్జునుడు ఆ పరిణామాలన్నిటినీ ఓకంట కనిపెడుతూనే వున్నాడు. అంతకంతకు కర్ణుని పరాక్రమం పెచ్చు పెరగటంతో అర్జునుడు కృష్ణుని చూస్తూ 'బావా! కర్ణుడు మన వాళ్లనందరినీ చీకాకు పరుస్తూ విజృంభిస్తున్నాడు. రథాన్ని అతనిమీదికి పోనివ్వు' అన్నాడు.

కృష్ణుని మనస్సులో ఓ సందేహం మెదలుతు

కిరణ్‌కుమారి

న్నందువల్లనే అంతసేపూ కర్ణునికి దూరంగా వుంచాడు అర్జునుణ్ణి! యిక అర్జునుడు స్వయంగా ఆ మాట అన్నతర్వాత తప్పదనుకుని, తన జాగ్రత్తలో తాను వుంటూనే రథాన్ని కర్ణుని వైపుకి పరుగెత్తించాడు.

అర్జునుడు తమసైన్యాలను తరుముతున్న కౌరవ సైన్యాలమీద శరవర్షం కురిపించి, వాళ్లను వెనక్కి మళ్లించి, దేవదత్తం పూరిస్తూ కర్ణునిపై తలపడ్డాడు. పాండవసేనలకు ఉత్సాహం పెరిగి, సింహగర్జనలు చేస్తూ పురోగమించారు. అర్జునుని తోడ్పాటు తమకు లభించడంతో కౌరవ సేనలను ఊచకోత కోయసాగారు!

కర్ణునికి శల్యుడు సారథ్యం చేస్తూండగా అర్జునునితో పోరాటం ప్రారంభమైంది. ఇరువురూ అతిభీకరములైన దివ్యాస్త్ర ప్రయోగాలతో భయంకర యుద్ధం చేయసాగారు.

కర్ణుడు చిరకాలంనుంచి తన అమ్ముల పొదిలో వున్న ఓ మహనీయ అస్త్రాన్ని మంత్ర పూర్వకంగా వింట సంధించి, అర్జునునికి గురిపెట్టాడు. అప్పుడు పాండవ శ్రేయోభిలాషి యైన శల్యుడు కర్ణునితో 'అంగరాజా! లక్ష్యం సరిగాలేదు. కవచధారియైన అర్జునుని వక్షస్థలాన్ని నీ అస్త్రం ఏంచెయ్యగలదనుకున్నావు?' అన్నాడు.

సరిగ్గా అర్జునుని కంఠానికి గురిపెట్టబడి నప్పటికీ, శల్యుని మాటలవల్ల అనుమానం కలిగి కర్ణుడు లక్ష్యాన్ని మరికాస్తపైకి జరిపాడు. అయితే అప్పుడు కూడా ఆ లక్ష్యం అర్జునుని కంఠానికి బదులు నుదుటి మీదకు సారించబడివుంది. శల్యుని మాటల ప్రభావం కర్ణుని మీద కొంతే



పడిందని భావించిన కృష్ణుడు, ఆదివ్యాస్త్రానికి అర్జునుని నుదురు వ్రయ్యలుకాకుండా తాను చెయ్యవలసిన దానిని గురించి ఆలోచించసాగాడు.

కర్ణుని ధనుస్సునుండి నిప్పురవ్వలను విర జిమ్ముతూ ఆమహాస్త్రం అర్జునుని వైపుగా దూసుకు రాసాగింది. అది సరిగ్గా అర్జునుణ్ణి సమీపించేసరికి కృష్ణుడు తన కుడి కాలి బొటన వ్రేలితో రథాన్ని నాలుగంగుళాల లోతున భూమి లోకి త్రొక్కాడు. కర్ణుడు ప్రయోగించిన దివ్యాస్త్రం నుదుటికి కాకుండా మరికొంతపైగా తగలటంతో అర్జునుని కిరీటం ఛిన్నా భిన్నమై పోయింది.

అలా కిరీట ఛేదనం చేసిన అస్త్రం మళ్లీ కర్ణుని దగ్గరికి వెళ్లి, ఈసారి అర్జునుని ప్రాణాలు తీస్తాననీ, పునఃప్రయోగం చెయ్యమని చెప్పింది.

'అర్జునా! మనం అగ్ని కోరిక ప్రకారం ఖాండవ వనాన్ని సంరక్షిస్తున్న సమయంలో ఓ సంఘటన జరిగింది. జ్ఞాపకం వుందా? నువ్వు నిర్మించిన బాణ పంజరంలోంచి బైటపడడానికి ప్రయత్నించి, అంతలో నీబాణం వల్ల సగంతెగి బైటపడి అదృశ్యమైపోయిన అశ్వసేనుడనే నాగ కుమారుడే యీ నాగాస్త్రం. నీ మీద పగబట్టి యింతకాలంనుంచి కర్ణుని దగ్గర వున్నాడు. మీమేనమామ శల్యుడు, నేను, చేసిన ప్రయో గాల వల్లనే నాగాస్త్రం నిన్నేమీ చెయ్యలేక, నీ కిరీటాన్ని ధ్వంసం చేసి, తిరిగి కర్ణుని దగ్గరికి వెళ్లి, మళ్లీ ప్రయోగించమని అతణ్ణి వత్తిడి చేస్తున్నది. కాని, ఒకసారి ప్రయోగించిన అస్త్రాన్ని తిరిగి ప్రయోగించే హీనపద్ధతికి కర్ణుడు దిగ జారడు కనుక మనకు భయంలేదు. లేకపోతే, ఉపసంహార ప్రభావానికి లొంగని యీనాగాస్త్రం వల్ల నీకుహాని కలిగేదే!' అని వివరించాడు కర్ణుడు.

ఆ తర్వాత కృష్ణుడు చెప్పినట్లు కర్ణునిచేత తిరస్కరించబడిన నాగ్రాస్త్రం వెలవెలబోతూ యుద్ధరంగం నుంచి తొలగిపోతూండటం చూసి అర్జునుడు నిట్టూర్పు విడిచాడు.






(గత సంచిక తరువాయి)

అది మధ్యాహ్న సమయం. తొండమాను ఎప్పటిలాగానే శ్రీ వేంకటేశ్వర స్వామిని అర్చించడానికి తిరుమలకు వచ్చాడు. స్వామి పుష్కరిణిలో స్నానం చేసి, ఆళ్వారు చెరువులోని నీళ్లను ఒక బిందెడు పట్టుకు వెళ్లాడు. నిన్న తాను అర్చించిన బంగారు తామరపూలను తీసి కడుగబోయాడు. ఆ బంగారు పూలమీద మట్టి పూలు కనిపించాయి. జాగ్రత్తగా వాటిని పరిశీలించాడు రాజు. అవి తులసీ దళాల మాదిరిగా ఉన్నాయి. మట్టితో చేసిన ఇన్ని తులసీదళాలు ఎక్కడినుంచి వచ్చాయో రాజుకు ఆశ్చర్యం కలిగింది.

శ్రీ వేంకటేశ్వర స్వామికి తులసీదళాలు ప్రియమైనవే. కాని, మట్టితో వాటిని చేసి పూజించే వారెవరు? తొండమాను పూజించి వెళ్లిన తర్వాత ఆ ఆలయంలోనికి మరొకరు ప్రవేశించిన జాడ లేదు.

తొండమాను ఆలోచనలో పడ్డాడు. బంగారు తామరపూలన్నీ శుభ్రంచేసి స్వామి మెడలో అలంకరించాడు. పూజ ముగించిన తర్వాత "స్వామీ! నీ మహిమ తెలుసుకోలేను. మట్టితో చేసిన ఈ తులసీ దళాలు ఎక్కడినుంచి వచ్చాయి? వీటితో ఎవరు నిన్ను పూజిస్తున్నారు? బంగారు పూల కంటే ఈ మట్టి దళాలే నీకిష్టమా? నా కంటె నీకు ఆంతరంగికుడైన భక్తుడుంటే అతడు మట్టి దళాలతో పూజించవలసిన పరిస్థితి ఏముంది? ఇది దేవతల పూజ అనుకోడానికి వీల్లేదు. వారు పారిజాత పుష్పాలతోనే నిన్ను పూజిస్తారు. నేను తెచ్చిన బంగారు తామరపూలకన్నా ఈ మట్టి తులసీ దళాలే నీ కిష్టమైనవని సూచించడానికి వీటిని ధరించావా? స్వామీ?" అని పరిపరివిధాలుగా ఆ స్వామికి తన హృదయావేదనను వెల్లడించాడు తొండమాను.

వరాహపురాణం



శ్రీవేంకటేశ్వరుడు తొండమాను పరితాపాన్ని పోగొట్టదలచాడు. ఆలయం లోపలినుంచి ఇలా వినిపించింది.

"ఓ రాజా! నీవలె నాకు భక్తులైనవారు అనేకులు అనేక ప్రదేశాలలో ఉన్నారు. అనేక విధాలుగా నన్ను పూజిస్తూ ఉంటారు. ఇక్కడికి దగ్గర్లో కుర్వ అనే గ్రామముంది. అక్కడ భీమదాసు ఒక కుమ్మరి ఉన్నాడు. అతడు నిరంతరం నన్ను ధ్యానిస్తుంటాడు. మట్టి తెచ్చేటప్పుడు, దానికి పిసికి మెత్తన చేసేటప్పుడు, కుండలు చేసే టప్పుడు, వాటిని కాల్చేటప్పుడు అతడు నన్ను స్మరిస్తూనే ఉంటాడు. ప్రతిరోజు మట్టితో తులసీ దళాలు చేసి ఇంట్లోనే నన్ను పూజిస్తుంటాడు. అతని భక్తికి నేను వశమయ్యాను. అతని మట్టి తులసీదళాలు అర్చనను ప్రీతి పూర్వకంగా స్వీక రిస్తున్నాను. నీ కంటె అతడు నాకు మిక్కిలి ఇష్టుడు, అనన్యభక్తుడు కనుక అతడు అర్పించిన మట్టిదళాలు నీ బంగారు తామర పూల మీద పడి కనిపిస్తున్నాయి. ఆ కుమ్మరి భక్తి ఎంత రహస్యమైనదో ఈ విషయమూ అంత రహస్యమైనదే. నీవు నాకు ఇష్టుడవు కాబట్టి నీకీ రహస్యం చెప్పాను."

భగవంతుని పలుకులలోని అంతరార్థాన్ని తొండమాను తెలుసుకొన్నాడు. తనకున్న దురభి మానాన్ని, స్వార్థాన్నీ దళాలను నాకు కనిపింప జేశాడు. అభిమానం, మమకారం ఈ రెండూ నన్ను కుమ్మరిభక్తుని కంటె తక్కువవాణ్ణి చేశాయి. ఆ కుమ్మరి భీమదాసు ఎలాంటివాడో చూడాలను కొన్నాడు తొండమాను.

అక్కడినుంచి తొండమాను సరాసరి కుర్వి గ్రామానికి బయలుదేరాడు. ఆ గ్రామంలో కమ్మరి వాని ఇల్లు ఒక్కటే ఉంది. వాకిట్లోనే కొత్తకుండ లుండటంవల్ల భీమదాసు ఇల్లు సులభంగా కను క్కొన్నాడు తొండమాను. వెళ్లి వాకిట్లో నిలబడ్డాడు.

భీమదాసు మహారాజును గుర్తించి వెలుపలికి వచ్చి నమస్కరించాడు. పాదాలకు మొక్కబోయాడు. అంతలోనే అతణ్ణి ఆపి తొండమాను ఇలా అన్నాడు.

"మహాత్మా! నీవు మహాభక్తుడవు. శతవృద్ధు డవు. నీవు నాకు నమస్కరించడం ఏమిటి? నేనే నీకు మ్రొక్కాలి. అందుకే ఇక్కడికి వచ్చాను.

నీభక్తిప్రపత్తులను చూచి స్వామివారి ఆంతరంగి కుడవు నీవే అని గ్రహించాను. ప్రభూ! మీరే మంటున్నారో నాకు బోధపడటంలేదు. నేను కుండలు చేసుకొని వాటిని విక్రయించి బ్రతికే సామాన్యమైన జీవిని. నాకు తెలిసినంత వరకు నే నెవరికి అపకారం చేయలేదు. ఎన్నడూ ఏనేరం చేసి ఎరుగను. తాము స్వయంగా మాయింటికి రావడం నా అదృష్టం. నిజానికి మీరు ఈ ఊరిలో ఎవరింటికి పోదలచి ఇక్కడి వచ్చారో నేనెరుగను. ఈ గ్రామంలో ధనసంపన్ను లున్నారు. రాజాధికారులున్నారు. వారి పేరు చెబితే మిమ్ములను వారింటికి తీసుకు వెళతాను. ఆజ్ఞ ఇవ్వండి" అన్నాడు తొండమాను.

"ఏ స్వామివారు?" ఆశ్చర్యంగా అడిగాడు భీమదాసు.

"శ్రీ వేంకటేశ్వరస్వామి." చెప్పాడు రాజు.

ఆ మాట వినడంతోటే ముసలి భీమదాసు చేతులు రెండూ పైకెత్తి నమస్కరించి క్షణంసేపు ధ్యానంలో నిమగ్నమయ్యాడు.

"భీమదాసా! శ్రీ వెంకటేశ్వరుడు నీ పూజలకు మెచ్చాడు. నేను అర్పించిన బంగారు తామరల మీద నీవు అర్పించిన మట్టితులసీ దళాలను నేనీరోజు చూచాను. నీ ఏకాంత భక్తిని, నీ పూజా విధానాన్ని తెలుసుకొనడానికి నిన్ను దర్శించ డానికి నేను వచ్చాను." అన్నాడు తొండమాను.

"ప్రభూ! నీకీ సంగతులన్నీ ఎవరు చెప్పారు?" అడిగాడు భీమదాసు.

"స్వామివారే చెప్పారు?"

"మీకు చెప్పారా? ఇంకా ఎవరికైనా చెబితే మీరు విన్నారా?" అడిగాడు భీమదాసు.



భీమదాసా! నీవంటి పుణ్యాత్మునితో అసత్యమా డతానా? స్వామివారి ఆనంద నిలయం నుండి గంభీరంగా వెలువడిన ఈ వాక్కులు స్వామివారివి కాకపోతే మరెవరివి? నీ దర్శనభాగ్యం నాకు కలిగించడానికే స్వామివారు నిన్ను గురించి చెప్పారు. నీ ఆంతరంగిక భక్తిని తెలపడానికి ఈ రోజు నీవర్పించిన మట్టి తులసీ దళాలను నాకు కనపడేలాగు చేశారు" అన్నాడు తొండమాను.

ఆ మాటలు వినడంతో భీమదాసు నేలకు ఒరిగిపోయాడు. అతని కుమారులు, తొండమాను భీమదాసును పట్టుకొని కూర్చుండబెట్టారు.

పూర్వం ఒకప్పుడు శ్రీ వేంకటేశ్వరస్వామి దయతో ఇచ్చిన వరాన్ని గుర్తుకు తెచ్చుకొని భీమదాసు తన కుమారులతోను, తొండమానుతోను ఇలా అన్నాడు.

నాయనలారా! ఈ మహారాజును చూడటంతోటే నా జన్మ ధన్యమయింది. స్వామివారికి చేసిన పూజ ఫలించింది. నాకు మోక్షకాలం ప్రాప్తించింది. శ్రీవేంకటేశ్వరుడు నా కొక వరమిచ్చాడు. నీవు చేసే రహస్యమైన పూజ ఏనాడు రెండోవాడికి తెలుస్తుందో ఆనాడు భవబంధాలు త్రెంచుకొని నా సన్నిధికి రాగలవు" అని వరమిచ్చాడు.

అని భీమదాసు చెబుతూండగానే ఒక దివ్య విమానం కుమ్మరివాని వాకిట్లో దిగింది. దివ్యాభరణాలు ధరించిన దేవత లిద్దరు ముందుకు వచ్చి భీమదాసుకు సాష్టాంగ నమస్కారం చేశారు. భగవదాజ్ఞను తెలిపారు.

భీమదాసు తన భార్యను పిలిచాడు. ఆమె వచ్చింది. "పద నాతో పాటు రావడానికి నీకు కూడా అధికారముంది. నీ తోడ్పాటు లేనిదే నేను స్వామివారిని పూజించలేక పోయేవాణ్ని." అని పలికి భీమదాసు భార్యతో పాటుగా దివ్య విమానం ఎక్కాడు. క్షణంలో అది ఆకాశానికి ఎగిసింది.

(శుభం)







# శ్రువవతి

శ్రువవతి భరద్వాజ మహాముని కూతురు. తల్లి లేని ఆమెను అతడు అతి గారాబంగా పెంచాడు. అందాలభరిణ, యవ్వనవతీ అయిన ఆమెకి తగిన వరుణ్ణి చూసి వివాహం జరిపించి, హిమాలయాల్లో తపస్సు చేసుకోటానికి వెళ్ళి పోవాలని భరద్వాజుడి తాపత్రయం.

ఒకరోజు భరద్వాజుడు శ్రువవతిని, "అమ్మా! నేను హిమాలయాలకి వెళ్ళక తప్పదు. నువ్వు వివాహం చేసుకోవటం కూడా తప్పదు. నీ మనసులో ఎవరైనా వుంటే చెప్పు. అతడితో నీ పెళ్ళి జరిపిస్తాను," అని అడిగితే శ్రువవతి భరద్వాజుడితో "నేను వివాహం చేసుకోటానికి తగిన వ్యక్తి యింతవరకూ నాకు ఆలోచనల్లో గాని ప్రత్యక్షంగా గాని తారసపడలేదు. అందు వల్ల నాకు వివాహం చేసుకోవాలన్న అభిప్రాయమే లేదు. అయితే నా నిర్ణయం మీరు హిమాలయాలకి వెళ్ళడానికి మాత్రం అడ్డురాదు. మీరు ఎప్పుడు వెళ్ళాలంటే అపుడు బయలుదేరి వెళ్ళవచ్చు. మీ గౌరవమర్యాదలకి భంగం కలగకుండా ఆశ్రమ నిర్వహణ చేపట్టి మిగిలిన జీవితం గడిపేస్తాను," అని చెప్పింది.

భరద్వాజుడు ఎంతగానో నచ్చ చెప్పి చూచినా ఆమె వినకపోవటంతో ఆశ్రమ సంరక్షణ ఆమెకి అప్పచెప్పి ఒకనాడు హిమాలయాలకి బయలు దేరి వెళ్ళిపోయాడు.

భరద్వాజమహర్షి వెళ్ళిపోయిన తర్వాత ఆశ్రమ భారమంతా శ్రువవతే మోసింది. ఆమె ఎంతో భక్తిశ్రద్ధలతో ఆశ్రమ పురోభివృద్ధికి పాటు బడింది. ఆశ్రమవాసులకు భరద్వాజుడులేని లోటును తీర్చింది. శ్రువవతి చేతుల్లో రూపుదిద్దు కున్న ఆశ్రమం ఎంతో అందంగా కనిపించేది.

కొన్నాళ్ళు గడిచాక, ఒకరోజు మధ్యాహ్నం వేళ ఎండతాపం ఎక్కువగా వుండటంతో స్నానం చేసి వద్దామని శ్రువవతి ఆశ్రమానికి దగ్గరలో వున్న ఒక కొలనుకి వెళ్ళింది. స్నానం ముగించి కూడా తెచ్చుకున్న కుండలో నీరు నింపటానికి

కమలిని.



ఆమె మరోసారి ఆ తటాకంలోకి దిగబోతూ నిర్మలంగా వున్న ఆ నీటిలో అందమైన ఒక పురుషుడి నీడని చూచింది. ఆ క్షణంలోనే ఆమె మనసు నీటి నీడలో కనపడుతున్న ఆ సుందరాకారుడి మీద లగ్నమయింది. ఆమె ఆ నీడకేసే రెప్పవేయకుండా చూస్తూ వుండి పోయింది. కొంత సేపటికి ఆ నీడ మాయమవటంతో కొలను ఒడ్డున వున్న అతడెవరో కాని, తన దారిన తాను వెళ్ళిపోయాడని శ్రువవతి గ్రహించి ఆశ్రమానికి తిరిగి వచ్చింది. అప్పటి నుంచీ ఆమె అన్న పానాలు కూడా సరిగా ముట్టకుండా ఆ నీటిలో రూపాన్ని మనసులో ఎల్లప్పుడూ తలచుకుంటూ పూజా పునస్కారాలు ప్రారంభించింది. స్నేహితురాండ్రు, బంధువులు తాను కోరుకుంటున్న ఆ యువకుడెవరని అడిగితే శ్రువవతి ఎలాటి సమాధానం చెప్పకుండా నవ్వేసి వూరుకునేది.

ఆ విధంగా నెలలూ, సంవత్సరాలు గడిచి పోతున్నాయి. ఆమె తపస్సు ఫలించిందా అన్నట్లు ఒకనాడు శ్రువవతికి తాను నీటి నీడలో చూసిన ఆ అందగాడు కళ్ళ ఎదుట వచ్చి నిలబడ్డాడు. ఆమె ఆనందానికి హద్దులు లేవు.

అతడు చిరునవ్వు నవ్వి "నేనెవరు? ఇప్పుడు ఎందుకు వచ్చాను? చెప్పగలవా?" అని అడిగాడు.

"మీరెవరో నాకు తెలియదు. తెలుసుకోవాలన్న కోరిక కూడా లేదు. కాని, మీరు వచ్చింది నా ప్రేమని సఫలం చెయ్యటానికే అన్న విశ్వాసం మాత్రం నాకున్నది," అన్నది శ్రువవతి.

"నువ్వు నన్నే కోరుతూ తదేక ధ్యానంతో ఎందుకు వుంటున్నావో తెలుసుకోవాలన్న కుతూహలంతో మాత్రమే వచ్చాను," అని అనగానే ఆమె, "మీకు నాపట్ల వున్నది కుతూహలమే కావచ్చు. కాని, మీ ఎడల నాకున్నది అచంచలమైన ప్రేమ!" అన్నది:

"నేనెవరో నీకు తెలియనట్లున్నది. నేను సాక్షాత్తూ సురపతి ఇంద్రుణ్ణి. నీలాటి సామాన్య మానవకాంతలు నావెంట దేవతలతో కలసి కాపురం చెయ్యటమన్నది జరగని పని. నీ ప్రయత్నం మాని, నన్ను మర్చిపో," అన్నాడు

ఆ పురుషుడు.

"ఆనాడు తటాకంలో మీ నీడని చూచిన మరుక్షణంలోనే నా మనసు మీకు అర్పించు కున్నాను. మీరు దేవలోక సురపతి అయివుంటా రని, మిమ్మల్ని కోరుకోవటం వలన దేవలోకపు దేవేరిని కావచ్చుననీ అప్పుడు నేను ఏ కోశానా వూహించలేదు. నాకు యిప్పుడు కూడా అలాంటి దురుద్దేశాలేమీ లేవు. కాని, మీరు అవునన్నా కాదన్నా మానసికంగా నా వివాహం మీతో ఆనాడే జరిగిపోయింది. నాకదే పదివేలు. ఇక మిమ్మల్ని వేధించను. మీదారిన వెళ్ళిరండి," అన్నది.

ఇంద్రుడు తనని భర్తగా భావించటం తగ దనీ, జరిగినదంతా మరచిపొమ్మని ఆమెకి ఎంతగానో నచ్చచెప్పి చూడబోయాడు. కాని, శ్రుపవతి తన పట్టు విడవకపోవటంతో విసిగి అక్కణ్ణించి అదృశ్యమైపోయాడు.

శ్రుపవతి జరిగిన సంగతి ఆశ్రమంలో ఎవరికీ చెప్పలేదు. పైకి తాను సంతోషంగా వున్నట్లు కనపడుతూ, అందరినీ సంతోషపెడుతూ, ఆశ్ర మాన్ని మునిపటి కన్నా శోభాయమానంగా వుంచుతూ కాలం గడుపుతూంది. కాని, ఇంద్రుడిపై అనురాగాన్ని మాత్రం మరల్చుకోలేక పోతున్నది. ఇలా ఎన్నో ఏళ్ళు గడిచిపోయాయి.

దేవలోక వ్యవహారాలలో మునిగితేలుతూ ఇంద్రుడు శ్రుపవతి మాటే మర్చిపోయాడు. కాని, కొన్నాళ్ళకి అతడు తనకు నానాటికీ మనశ్శాంతి



కరువైపోతున్నదనీ, అందుకు కారణం తన నుంచి ఏదో వాంఛిస్తూ ఎవరో తపమో జపమో చేస్తున్నారనీ గ్రహించాడు. దివ్యదృష్టితో చూడగా, భరద్వాజాశ్రమంలో తనని భర్తగా భావిస్తూ ఏకాగ్రతతో తన మీదే మనసు నిలిపి కాలం గడుపుతూన్న శ్రుపవతి అతడి కంటపడింది. ఇంద్రుడు వెంటనే తన దివ్యరథం ఎక్కి భర ద్వాజాశ్రమానికి వెళ్ళాడు. రథాన్ని ఆశ్రమం సమీ పంలో వున్న అరణ్యంలో నిలిపి, ఇంద్రుడు ఒక వృద్ధ బ్రాహ్మణుడి వేషంలో ఆశ్రమంలోకి వెళ్ళాడు. చంపక వృక్షం క్రింద నిలబడి పువ్వులు ఏరుకుంటున్న శ్రుపవతి బ్రాహ్మణ వేషంలో ఉన్న ఇంద్రుడికి ప్రణామం చేసి నిల బడింది.



"ఈ పువ్వులన్నీ ఎవరి పూజకోసం! నీ భర్త కోసం కదూ?" అని అతడు అడిగితే అవునన్నట్లు తల వూపింది.

"చూడటానికి కన్యలాగా కనపడుతున్నావు. ఇంతకీ నీ భర్త ఎవరు?" అని అడగ్గా శ్రువవతి కోపంతో ఆ ప్రశ్నకి సమాధానం చెప్ప వలసిన అవసరం తనకి లేదని అతణ్ణి మందలించింది.

బ్రాహ్మణుడు వేళాకోళంగా, "అతడు నిన్ను తిరస్కరించాడు అవునా?" అని అడిగితే, శ్రువవతి ముక్తసరిగా అవునని వూరుకున్నది.

కాని బ్రాహ్మణుడు మరింత ఎగతాళిగా ఆమెను కవ్విస్తే శ్రువవతి వస్తున్న కోపాన్ని ఆపుకుంటూ, "ప్రేమ వస్తువు కాదు కదా, ఒక సారి యిచ్చినది తిరిగి పుచ్చుకోటానికి? పెద్దవారు మీకీ విషయంలో నేను చెప్పాల్సింది లేదు," అన్నది.

ఆమెకిక చెప్పి ప్రయోజనం లేదని బ్రాహ్మణ వేషధారుడైన ఇంద్రుడు ఆమె దగ్గర సెలవు తీసుకొని దేవలోకం తిరిగి వచ్చేశాడు. కాని, అతడి మనస్తాపం రోజు రోజుకీ మరింత ఎక్కువ కాసాగింది. ఆమె పవిత్ర ప్రేమకి ఒక పరిష్కారం కలిగించేంత వరకూ తన పరిస్థితి అలాగే వుంటుందని అతడికి అర్థమయింది.

అతడు ఒక సారి ఒక అందమైన పురుషుడిగా రూపంధరించి శ్రువవతిని కలిసి, నేను వసిష్ఠ మునిని. నిన్ను వివాహం చేసుకోవాలని వచ్చాను. మాట మాత్రానికైనా నేను అది అనివుంటే నీ తండ్రి భరద్వాజుడు మన వివాహం ఇదివరకే జరిపించి వుండేవాడు. నీకు సమ్మతమైతే వివాహపు ఏర్పాట్లు అన్నీ చేసుకు వస్తాను," అన్నాడు.

వచ్చిన వాడు వసిష్ఠుడని శ్రువవతికి నమ్మ శక్యం కాలేదు. వసిష్ఠుడు జ్ఞానవృద్ధుడే కాక, వయో వృద్ధుడని కూడా ఆమె విని వున్నది.

అయినా, ఆమె వినయంతో "నేను దేవేంద్రుడిని మనసారా వరించాను. నా వివాహం అతడితో జరిగిపోయినట్లే భావిస్తున్నాను," అన్నది.

మాయ రూపంలో వున్న ఇంద్రుడు నవ్వి "శ్రువవతీ! నాపట్ల వున్న తృణీకార భావంతో ఏవో సాకులు చెప్తున్నావు. అందుకు నిన్ను నేను ఘోరంగా శపించగలను. కాని,



భరద్వాజుడి మీద వున్న గౌరవంతో నేనా పని చెయ్యటంలేదు. నీకు నిజంగా యింద్రుడి మీద ఎంత ప్రేమ వున్నదో చూచి తీరాలి," అంటూ కొన్ని నేరేడు పళ్ళు ఆమెకిస్తూ, "వీటిని వుడక బెట్టి తీసుకురా, పళ్ళు ఉడికినట్లయితే నేను నీ జోలికి రాను. కాకుంటే, నువ్వా ఇంద్రుణ్ణి పూర్తిగా మర్చిపోవాలి," అన్నాడు.

వజ్రాల కన్నా గట్టిగా వున్న అలాంటి నేరేడు పళ్ళు శ్రువవతి అంతకు ముందెన్నడూ చూడ లేదు. ఆమె ఎంత ప్రయత్నం చేసినా ఆ పళ్ళు ఉడికి మెత్తబడ లేదు. శ్రువవతి వెంటనే ఆశ్ర మంలో వున్న తులసీ వనంలోంచి ఎండుపుల్లలు ఏరి తెచ్చి ఒక పెద్ద చితిని ఏర్పాటు చేసింది. మాయారూపంలో ఉన్న దేవేంద్రుడు ఆమె ఎందుకిలా చేస్తున్నదో అర్థంకాక, దాని గురించి అడిగాడు.

మీరు అజ్ఞాపించిన విధంగా నేరేడు పళ్ళు ఉడికించలేక పోయాను. అందుచేత మీరు కోరిన ప్రకారం నేను ఇంద్రుణ్ణి మరచిపోవాల్సి వుంటుంది. కాని, ఆ దేవనాథుణ్ణి మరచి నేను బ్రతకలేను. అందుకే అగ్నిప్రవేశం చేసి ఆత్మార్పణం చేసుకో దలిచాను," అన్నది శ్రువవతి.

వెంటనే ఇంద్రుడు తన నిజ రూపంతో ఆమె ముందుకు వచ్చి, "శ్రువవతీ! నీ నిశ్చల ప్రేమకి ముగ్ధుడనయ్యాను, ఏదైనా వరం కోరుకో" అంటే, శ్రువవతి "మిమ్మల్ని ఎటువంటి మాటా అడగననీ వేధించనని యిదివరకే చెప్పాను కదా!" అన్నది.

ఇంద్రుడు ఆమె నిస్వార్థతకి మురిసిపోతూ, "నేను నీకు వరం యిచ్చితీరాలి, శ్రువవతీ! నిన్ను నేను వివాహం చేసుకోటానికి నాకేం అభ్యంతరం లేదు. కాని, మానవ కాంతవైన నువ్వు స్వర్గానికి చేరుకున్నాకనే అది సాధ్య పడు తుంది!" అన్నాడు.

"దేవా! నిన్ను నేను వరించి భర్తగా పొందా లనుకున్నది యీ మానవదేహంతోనే కదా! అది సాధ్యం కానప్పుడు నాకెలాంటి వరాలూ అక్కర లేదు," అన్నది శ్రువవతి.

ఇంద్రుడు కోపంతో, "శ్రువవతీ! నిన్ను మానవ శరీరంతో వుండగా నా భార్యని చేసుకో

టానికి సాధ్యం కాదని చెప్పాను. నీ పట్టుదలా మూర్ఖత్వం నానాటికి పెరుగుతున్నట్లు కనపడుతూంది, నీకు చెప్పి ప్రయోజనం లేదు," అంటూ అదృశ్యం అయిపోయాడు.

ఆ మరుక్షణం నుంచీ శ్రువవతి నిద్రాహారాలు మాని అతడి నామాన్నే జపిస్తూ కాలం వెళ్ళబుచ్చసాగింది.

ఒకరోజు ఇంద్రుడు దేవ సభలో ఊర్వశి చేస్తున్న అపూర్వమైన నృత్యాన్ని భార్యలతో కలిసి తిలకిస్తున్నాడు. ఉన్నట్టుండి అతడికి దేహమంతా ఏదో చెప్పరాని బాధ ప్రారంభమయింది. అతడు ఓ కేక పెట్టి సభలో వున్నవాళ్ళంతా ఆశ్చర్యంతో చూస్తుండగా సింహాసనం దిగి శ్రువవతి వున్న చోటికి పరుగున బయలుదేరాడు.

ఇంద్రుడు భరద్వాజాశ్రమం చేరే సరికి, శ్రువవతి అక్కడ అతడి నామాన్ని స్మరిస్తూ కొనవూపిరితో వున్నది.

ఇంద్రుడు ఆమెను పలకరించి, "శ్రువవతీ! నీపట్ల నేను ఇన్నాళ్ళూ ఎంతో క్రూరంగా ప్రవర్తించాను, నన్ను క్షమించు. ఈ క్షణం నుంచే నిన్ను నా భార్యగా స్వీకరించటానికి అంగీకరిస్తున్నాను," అన్నాడు.

శ్రువవతి హీనస్వరంతో "దేవా! అయితే నాకు మరణించి స్వర్గం చేరుకోకుండానే మీ భార్యనయ్యే అదృష్టం ప్రసాదించారా?" అని అడిగితే, అందుకు ఇంద్రుడు, "అవును శ్రువవతీ! నీ పట్టుదలా, ఏకాగ్రతా, నిస్వార్థతా, నిశ్చల ప్రేమా అనితర సాధ్యాలు. అందుకే నువ్వు స్వర్గానికి రానక్కర లేకుండా నీ కోరిక సఫలం చెయ్యటానికి స్వర్గమే నీ దగ్గరికి దిగి వచ్చింది," అని ఆమెని ఆశీర్వదించాడు.

ఆ తరువాత, దేవతలంతా ఆకాశంలో నుంచి పుష్పవృష్టి కురిపిస్తూండగా, ఆశ్రమవాసులందరి సమక్షంలో ఇంద్రుడు శ్రువవతిని అతివైభవంగా వివాహం చేసుకున్నాడు.





# దేవుడి మహిమ

నల్లకొండపై వెలసిన నారాయణమూర్తికి, శతాబ్దాలక్రితం ఓ రాజు గుడి కట్టించాడు. అయితే, గుడికి వెళ్ళటానికి సరైన దారిలేదు. నారాయణమూర్తికి భక్తుల కోర్కెలు తీర్చుతాడన్న ప్రతీతి ఉండటంవల్ల, ఎందరో భక్తులు శ్రమ పడి కొండెక్కి, దేవుణ్ణి దర్శనం చేసుకుంటూ వుంటారు.

వ్యాపారంలో చాలా కాలంగా నష్ట పోతున్న వరాలయ్య, ఈ సారి మంచి లాభాలు వస్తే, నల్లకొండ నారాయణమూర్తికి పదివేలవరహాల ముడుపు చెల్లించుకుంటానని మొక్కుకున్నాడు. ఆ దేవుడి మహిమ వల్లనో ఏమో, వరాలయ్యకు ఆ ఏడు దండిగా లాభాలు వచ్చాయి. అన్నమాట నిలబెట్టుకునేందుకు, అతడు డబ్బుతీసుకుని ఒంటరిగా బయలుదేరాడు.

"దారి ప్రమాదకరమైనది. డబ్బుతో వెళుతున్నారు. ఒంటరిగావెళ్ళవద్దు. తోడుగా ఎవరినైనా తీసుకుని వెళ్ళండి," అంది రామయ్య భార్య.

"దేవుడి కొండకు ఒంటరిగా వెళితేనే పుణ్యం. నేను తీసుకువెళ్ళే డబ్బు దేవుడికివ్వటానికే కదా! తన డబ్బు నాయనే రక్షించుకో గలడు," అన్నాడు రామయ్య.

ఆ ఊళ్ళోనే చిత్రాంగుడనే దొంగ ఉన్నాడు. అతడికి వరాలయ్య డబ్బుతో వెళుతున్నట్లు తెలిసింది. ఆ డబ్బును దొంగిలించాలని అనుకొన్నాడు. దొంగతనానికి బయలుదేరే ముందు చిత్రాంగుడు ఇలా మొక్కుకున్నాడు.

"ఓ స్వామీ! ఆ వరాలయ్య డబ్బు నాకు వచ్చేలా చేయి. నీకు అభిషేకం చేయిస్తాను."

ఈ విధంగా వరాలయ్య, చిత్రాంగుడు నల్లకొండకు ప్రయాణమయ్యారు. దారి మధ్యలో చిత్రాంగుడు ఒంటరిగాఉన్న రామయ్యను కత్తి చూపి, బెదిరించి డబ్బంతా దోచుకున్నాడు. ఆ తర్వాత, అతడు కొండమీదకు వెళ్ళి దేవుడికి అభిషేకం చేయించాడు.

శ్రీరాములు.

ఆ తరవాత, లక్ష్మీదేవి భర్తతో మాట్లాడుతూ, "స్వామీ! ఈ తుచ్ఛుడి కారణంగా జరుగుతున్న అభిషేక జలం మీ శరీరానికి బాధను కలిగించటం లేదా?" అని అడిగింది.

"దేవీ! చిత్రాంగుణ్ణి నీవు తుచ్ఛుడని ఎందుకని అనుకుంటున్నావు?" అని అడిగాడు నారాయణమూర్తి.

"న్యాయంగా తమకు చెందాల్సిన డబ్బును వరాలయ్య నుంచిదోచుకున్నాడు చిత్రాంగుడు తుచ్ఛుడు కాడా?" అంది లక్ష్మీదేవి.

"అయితే, వరాలయ్య తనడబ్బును న్యాయంగా సంపాదించేడంటావా? ప్రజల్ను మోసం చేసి అధిక లాభాలు ఆర్జించాడు. కాదంటావా దేవీ?" అన్నాడు నారాయణమూర్తి.

"అయితే, మీరెందుకు వరాలయ్యకు సహాయ పడ్డారు?" అంది లక్ష్మీదేవి.

"దేవీ! ఇది కలికాలం. నన్ను కోర్కెలు కోరే వారందరూ తుచ్ఛులే! దైవభక్తి కారణంగా వారి పాపాలు కొంత అందులో ఉంటాయి. వరాలయ్యకు లాభాలు వచ్చేలాచేశాను.దొంగకు పదివేల వరహాలు వరాలయ్య నుంచి ఇప్పించాను. దొంగ నాకు మ్రొక్కుకున్నాడు, కాబట్టి, వాడికి నేను బాకీపడ్డట్లేకదా! పాపిష్టి డబ్బును ఒకచేతి నుంచి మరో చేతికి మార్చుతూ పాపాత్ములకు నాపట్ల నమ్మకముండేలా చేసుకొనటంలోనే నా మహిమఉన్నది,"అన్నాడు నారాయణమూర్తి.

"అయితే, ఈ విషయం తెలియక డబ్బు పోయిందని వరాలయ్య లబో దిబోమని ఏడుస్తున్నాడు. అతడికీ విషయం ఎలా తెలుస్తుంది?" అంది లక్ష్మీదేవి.

"అతడికి కలలో కనపడి చెపుతానులే!" అన్నాడు నారాయణమూర్తి.

ఆ రాత్రి వరాలయ్య కలలో నారాయణమూర్తి కనబడి, "ఓయీ, వరాలయ్యా! దిగులు పడకు. నీవిస్తానన్న పది వేల వరహాలూ నాకే చేరాయిలే," అని చెప్పాడు.



# రాజభక్తి

ఒకప్పుడు కరాళుడనే మాంత్రికుడు అడవిలో మృగాలన్నింటినీ యువతులుగా మార్చాడు. పుష్పార్ణరాజ్యపు వీరులు ఈ యువతుల ఆకర్షణకు గురయ్యారు. పుష్పర్ణరాజు శరణువేడగా సవిత్ర్యుకుడు అనే మహర్షి సుందరకారుడిగా మారి అడవికివెళ్లాడు. సవిత్ర్యుకుడి తపశ్శక్తిని భగ్నం చేయాలని స్త్రీరూపంలో వున్న మృగాన్ని ఆవహించి కరాళుడు "సుందరాకారా! సైనికుడి అనుచిత ప్రవర్తనని రాజభక్తిగా భావించిన ఒకరాజు కథ చెప్తాను. ఈ కథలోని చిక్కుసమస్యని పరిష్కరించలేకపోయావో నువ్వు నాకు బానిసవు కావల్సి ఉంటుంది" అన్నాడు.

---

## కరాళకథలు





సవిత్రుకుడు సరేనన్నాడు. కరాళుడు ఆవహించిన యువతి కథ చెప్పడం ప్రారంభించింది.

మగధరాజైన గోపాలసింహుడు వృద్ధుడయ్యాక ప్రభావతి అనే చెలికత్తెను మోహించి వివాహమాడాడు. స్వతహాగా ప్రభావతి అంత మంచి మనిషి కాదు. రాణివాసంలో వుంటూ రాణుల మధ్య తగాదాలు పెడుతూ వుండేది. దేశంలో జరిగిన పనికిరాని విషయాలు అనేకం సేకరించి, రాణులకు అవి కథల్లా వినిపించి, వారి మనస్సులను కలుషితం చేస్తూ వుండేది.

గోపాలసింహుడు ఎంతమాత్రం ఆమెను వివాహమాడ వలసింది కాదు. ఆమె చూపిన హొయలు, దొంగ వలపులు నిజమనుకుని, మహారాజు ఆమెపై మనస్సుపడి వివాహమాడాడు.

అయితే, గర్విష్ఠి అయిన ప్రభావతి, రాజుని ఏ మాత్రం గౌరవించక, "ఇన్నాళ్ళు నేను సేవల్లో గడిపాను. సేవలు చేయటమేగాక, సేవలు ఎలా చేయించుకోవాలో కూడా నాకు క్షుణ్ణంగా తెలును. ఇప్పుడు మీరు నాకు సేవజేస్తే అది నాకు గర్వంగా వుంటుంది," అంది.

మహారాజు వృద్ధుడు. పైగా ప్రభావతి యవ్వనంలో వున్నది.

ఆమె మెప్పుకోసం, "నన్ను ఏమి చేయమంటావో చెప్పు, అది తప్పక చేస్తాను," అన్నాడు మహారాజు.

"నేను వరబ్రహ్మం అనే సైనికుణ్ణి వివాహమాడవల్సింది. 'కేవలం చెలికత్తెను వివాహమాడవల్సిన అవసరం నాకు లేదు,' అని అతడు నన్ను తిరస్కరించాడు. ఇప్పుడతడు మీ సైన్యంలో వీరాధి వీరుడుగా చలామణీ అవుతున్నాడు. అతణ్ణి ఓసారి పిలవండి. నా హోదాతో అతడి మనస్సుకి తూట్లు పొడవాలని కోరికగా వుంది నాకు," అంది ప్రభావతి.

"నేను నా నోటితో, 'రాణిగారు పిలుస్తూంది. నీవు వెళ్ళు' అని ఎలా చెప్పను? నీవే అతడికి కబురు పంపి, అవమానించి పంపేయ్," అన్నాడు మహారాజు.

ప్రభావతికి చాలా కోపం వచ్చింది.

"అయితే, మీరు నాకు తీర్చగలిగిన కోరిక ఏమిటి? ఈ వయస్సులో నన్నెందుకు వివాహ



మాడారు?" అంది కళ్ళు నీళ్ళు పెట్టుకుని ప్రభావతి.

ఆమె కళ్ళు నీళ్ళు పెట్టుకునే సరికి, మహారాజు విలవిల్లాడి పోయి, "అలాగే!" అని చెప్పి, పరబ్రహ్మాన్ని తానే స్వయంగా పిలిచి ప్రభావతిని కలవమని చెప్పాడు.

ప్రభావతి గర్వ మేమిటో పరబ్రహ్మానికి అర్థ మయింది. అతడు ప్రభావతికి కనిపించి వచ్చేందుకని వెళ్ళాడు. ఎంతో అందంగా, తన హోదా తెలియటం కోసం విలువైన నగలూ దుస్తులూ ధరించి, ప్రభావతి అతడికి దర్శన మిచ్చింది.

"మహారాణికీ భృత్యుడు వంగి దణ్ణాలు సమర్పించు కుంటున్నాడు. మీరు నన్ను రమ్మని ఎందుకు కబురు పంపారో శెలవిప్పించండి," అన్నాడు పరబ్రహ్మం.

"నా పేరు ప్రభావతి!" అంది పకపక నవ్వుతూ ప్రభావతి.

"కేవలం మీరు ప్రభావతే కాదు. మహారాణి అని కూడా తెలుసు. అందుకే యీ భృత్యుడు మీ అనుజ్ఞ కోసం వేచి వున్నది," అన్నాడు పరబ్రహ్మం వినయంగా.

"ఒకనాడు చెలికత్తె నీ హోదాకు సరిపోదని అన్నావు. ఇపుడు నా హోదా ముందు నీవు నలకలాంటి షాడివి. నీ తల తీయించాలంటే నాకు క్షణం చాలు," అంది ప్రభావతి గర్వంగా.

ఇంకా నీవు చెలికత్తెవో, రాణివో ఆలోచించు కుని, ఆ ఆలోచన మేర నాకు శిక్ష విధించ వచ్చు," అన్నాడు ఎలాంటి జంకూ లేకుండా పరబ్రహ్మం.

ప్రభావతికి అతడి మాటలు కొరడా దెబ్బల్లా తగిలాయి.

"నా ముందు నుంచి అవతలికి పో!" అని పెద్దగా అరిచి, వెంటనే మహారాజుని కలుసు కుని, "నాకు ఆ పరబ్రహ్మంగాడి తల కావాలి. అప్పుడే మీరు నన్ను ప్రేమిస్తున్నట్టు," అంది ఏడుస్తూ.

మహారాజు ఆమెని అనునయంగా దగ్గరికి తీసుకొని ఓదార్చుతూ, "వాడు వీరుడు. అలాంటి వీరుల వల్లనే ఏ రాజైనా సురక్షితంగా వుండ వలసింది. అలాంటి వారిని చంపితే, నష్టం



వారికన్నా మనకే ఎక్కువ. మన రక్షణ మనం చేతులతో నాశనం చేసుకున్నట్టవుతుంది," అని నచ్చచెప్ప బోయాడు.

"కాదు. వాడి తల నాకు కావాలి. అప్పుడు నేను మీ ప్రేయసిని," అంది మొండిగా ప్రభావతి.

మహారాజు చేసేది లేక, "మళ్ళీ వాడిని నీ దగ్గరికి పంపిస్తాను. నీవు దురుసుగా ప్రవర్తించి, వాడు ఏదోఒక తప్పు చేసేలా చెయ్. అప్పుడు వాడి తల తీయించటం నాకు తేలిక," అన్నాడు.

మహారాజు పనికిరాని వాడుగా కనిపించాడు ప్రభావతికి.

"సరే వాణ్ణి పంపండి," అని ప్రభావతి ఓ పెద్ద కత్తితో తయారయింది.

ఆ కత్తితో పరబ్రహ్మం తల ఎగిరి అవతల పడేలా నరకాలని ఆమె ఉద్దేశం.

పరబ్రహ్మం వచ్చేసరికి, అతణ్ణి కత్తితో చావు దెబ్బ తీసేందుకు ప్రభావతి సిద్ధంగానే వున్నది.

ప్రభావతి అతణ్ణి నరకబోయే సరికి, పరబ్రహ్మం తన కత్తితో అవలీలగా ఆమె కత్తి ఎగరకొట్టి యిలా అన్నాడు.

"నేను ఎలాగైనా చస్తానని నాకు తెలుసు. చచ్చేవాడికి ఎంత తెగింపు వుంటుందో నీకు చవి చూపించాలంటే, నేను నిన్ను నరకాలి. నిన్ను చంపటానికి నాకు ఒక్క క్షణం చాలు కాని, నిన్ను చంపను," అంటూ ముందుకు వచ్చి, అకస్మాత్తుగా కత్తితో ఆమె ముక్కు కోసేశాడు.

ప్రభావతి వేసిన కేకకు మహారాజు పరుగెత్తు కొచ్చాడు. ముక్కు తెగి రక్తంతో ఆమె ముఖం భీభత్సంగా తయారయింది. ఏమి జరిగి వుంటుందో మహారాజు గ్రహించి, పరబ్రహ్మాన్ని అవతలికి వెళ్ళి పోవల్సిందిగా ఆజ్ఞాపించాడు.

"నా ముక్కు తెగిపోయినా, అతడిని చంపక వదిలేస్తారన్న మాట?" అంది ఏడుస్తూ ప్రభావతి.

అందుకు మహారాజు నవ్వి వూరుకున్నాడు. మర్నాడు పరబ్రహ్మాన్ని పిలిచి అతడికి ఉపసేనాని పదవి యిచ్చాడు. అంతే కాదు, ప్రభావతికి భరణం యిచ్చి, మహారాజు తన అంతఃపురం నుండి బయటికి పంపేశాడు.

కరాళుడింత వరకే కథ చెప్పి, "ప్రభావతి సందేహం లేకుండా నీచురాలు. ఆమెకు ముక్కు తెగటం ద్వారా జరగవల్సినది జరిగింది. కాని, పరబ్రహ్మం చేసింది పెద్ద నేరం. మహారాజు అతగాడి ప్రవర్తనకు అతణ్ణి శిక్షించాల్సింది పోయి, ప్రభావతికి భరణం యిచ్చి పంపేశాడు. రాజు చేసిన పనిలో అర్థం ఏముంది? ఈ ప్రశ్నకు జవాబు చెప్పకపోతే నీవు ఓడిపోయినట్టే సవిత్యుక మహారాజా!" అన్నాడు.

అప్పుడు సవిత్యుకుడు యీ రకంగా జవాబు చెప్పాడు.

"తనకు చావు తప్పదని పరబ్రహ్మానికి అర్థమయింది. మహారాజు ప్రభావతి హొయలకు భ్రమించి పెళ్ళి చేసుకున్నాడు. మనిషిలో అందమనేది క్షణికమైన విషయం. ముక్కు కోయక ముందు ప్రభావతి గొప్ప అందగత్తె కావచ్చు. ముక్కు తెగాక, ఆమె అందం ఏమిటో మహారాజు యిట్టే గ్రహించాలని పరబ్రహ్మం ఉద్దేశం. తను చనిపోయే లోపల మహారాజుకి యీ విషయం అర్థమయితే చాలని, పరబ్రహ్మం తన ప్రాణాలకు తెగించి, ప్రభావతి ముక్కు కోశాడు. ముక్కు లేని ప్రభావతిని చూసేసరికి మహారాజుకి అసహ్యమేసింది.

"మనిషిలో అందం ఎంత అశాశ్వతమో పరబ్రహ్మం ప్రాణాలకు తెగించి తనకు తెలియజేయటం మహారాజుకి నచ్చింది. పరబ్రహ్మం రక్షించింది తన ఒక్కడినే కాదు, దేశాన్ని కూడ రక్షించాడు! తన ప్రాణాలు పోయినా, మహారాజు వాస్తవాన్ని తెలుసుకుని క్షేమంగా వుండాలని కోరుకున్న పరబ్రహ్మం నిజంగా రాజభక్తి కలవాడు. అది గ్రహించి మహారాజు అతడికి ఉపసేనాని పదవి యిచ్చి గౌరవించాడు."

సరైన సమాధానం రావటంతో సవిత్యుకుడి కెదురుగా వున్న యువతిపై కరాళుడి ప్రభావం నశించి, ఆ కన్య తోడేలుగా మారి అడవిలోకి పరుగు తీసింది.





# చేదుమందు

సమీరదేశంలో రాజోద్యోగుల అసమర్థతా, అవినీతీ నానాటికీ హెచ్చవుతున్నందువల్ల పరిపాలనలో ప్రతిష్టంభన ఏర్పడటమే కాక, మహారాజుకి అప్రతిష్టకూడా కలుగుతున్నదని చారులు సేకరించిన సమాచారం మహారాజు చందనవర్మకి చాలా ఆందోళన కలిగించింది వెంటనే అతడు మంత్రి గుణనిధిని అటువంటి ఉద్యోగులను గురించి వివరాలు సేకరించి, జాబితాని తయారుచేసి తనకు చూపించమన్నాడు.

మంత్రి రాజాజ్ఞ ప్రకారం జాబితా తయారు చేసి, మహారాజుకి చూపించగా, అతడు ఎంతో ఆశ్చర్యపోయాడు.

అప్పుడు మంత్రి నవ్వి, "మూక ఉమ్మడిగా మీరు వీరందర్నీ పదవుల్లోనుంచి తొలగించాలి. అంతకన్నా మరో ఉపాయం లేదు," అన్నాడు.

చందనవర్మ కంగారుపడుతూ, "ఈ ఉద్యోగులందరూ నేను దాయాదుల నుంచి ఎన్నో చిక్కులని ఎదుర్కొంటున్న సమయంలో నాకు ఎంతగానో సహాయపడి, యీ రాజ్య సింహాసనం దక్కించుకోటానికి సహాయపడిన బంధువులకీ స్నేహితులకీ చెందిన మనుషులని మీకు తెలియని విషయం కాదు. వీళ్ళమీద తీసుకొనే చర్యవల్ల కలిగే సాధక బాధకాలని మీరు ఆలోచించినట్లు కనపడదు," అన్నాడు.

"ప్రభూ! సమర్థులైన పరిపాలకులు ఒక్కొక్కసారి యిలాంటి నిర్ణయాలు తీసుకోవలసి వస్తుంది. సందేహించకుండా తమరు ఆజ్ఞలు అమలు చేయండి," అన్నాడు.

విధిలేక చందనవర్మ అందుకు సరేనన్నాడు.

మరునాడు చందనవర్మ గుణనిధిని పిలిపించి, "నేను ఊహించినట్లు గానే, ఆ ఉద్యోగులందర్నీ తొలగించినందుకు నా బంధువులూ, స్నేహితులూ తీవ్రమైన అసంతృప్తిని వ్యక్తం చేస్తూ, నిర్ణయాన్ని మార్చుకోమంటూ నా మీద ఒత్తిడి తీసుకొని వస్తున్నారు. కోరి తెచ్చి పెట్టుకున్న యీ సమస్యతో ఒకే ఆలోచనలు! రాత్రంతా

జొన్నలగడ్డ రత్న

నిద్ర పట్టలేదు. అందువల్ల, భరించలేని తల నొప్పి పట్టుకొని పీడిస్తున్నది. ఎన్ని మందులు సేవించినా, రవంత కూడా ప్రయోజనం కనపడ లేదు," అన్నాడు.

అందుకు గుణనిధి నొచ్చుకుంటూ, "అలా గనా ప్రభూ! అయితే, ముందుగా తమ శిరో భారం తగ్గనివ్వండి. చెయ్యాల్సిన దానిని గురించి తరవాత ఆలోచిద్దాం," అంటూ ఏదో గుర్తుకు వచ్చి, "ప్రభూ! తలనొప్పిని చిటికల మీద పోగొట్టే కషాయం ఒకటి వున్నది. దానిని వండే విధానం మా తల్లిగారికి తెలుసు. కాని, అది కాలకూట విషంలాగా వుంటుంది. ఒక్క గుటక వెయ్యటమే కష్టం! దాన్ని తెప్పించ మంటారా?" అన్నాడు.

మహారాజు విసుగ్గా, "ప్రాణం నిలబడు తూందంటే విషం త్రాగటానికి కూడా నే సిద్ధమే! అలాగే కానివ్వండి," అన్నాడు.

మంత్రి యింటి నుంచి వచ్చిన కషాయం అతి కష్టం మీద ఒక గుక్కెడు మింగుతూనే కోపంతో ముఖం కందిపోయింది చందనవర్మకి.

"ఇలాంటి చేదుమందు తాగేకన్నా తల నొప్పితో బాధ పడుటకు నాకు సుఖమని పిస్తున్నది!" అన్నాడు చందనవర్మ విసుగ్గా.

కాని, కొద్ది క్షణాల తరవాత, అతడు తెరిపిన పడిన వాడిలా గుణనిధిని చూచి, "మీరన్నది నిజమే! తలనొప్పంతా చేతితో తీసి పారేసి నట్లున్నది!" అన్నాడు.



గుణనిధి నవ్వుతూ, "మహారాజా! తమరు పూర్తిగా విశ్రాంతి తీసుకొండి. రాజోద్యోగుల వ్యవహారం తరవాత ఆలోచిద్దాం," అంటూ అతడి దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

రెండు రోజులు పోయాక, చందనవర్మే గుణ నిధికి కబురుపంపి, పిలిపించి, "అంతా ఆశ్చర్యంగా వున్నది. మన చారులు తెచ్చిన వార్తల్ని బట్టి, మహారాజు ఎలాంటి ఆశ్రిత పక్ష పాతమూ బంధుప్రీతీ లేకుండా అసమర్థతనీ, అవినీతినీ చెండాడి వేశారని ప్రజలు అను కుంటున్నారట! మిగిలిన ఉద్యోగు లందరూ ఎప్పుడు తమ కొంప మునుగుతుందో అన్న భయంతో శక్తి వంచన లేకుండా తమ విధులు నిర్వహిస్తున్నారట. ఎంతలో ఎంత మార్పు?"

అన్నాడు.

అప్పుడు గుణనిధి మందహాసం చేస్తూ, "ఇందులో ఆశ్చర్యం ఏమున్నదీ? రెండు రోజుల క్రిందట భరించలేని తలనొప్పి వచ్చినప్పుడు, తమరు చేదైన కషాయమొకటి సేవించారు. తలనొప్పి అక్కడి కక్కడే తగ్గిపోయింది. గుర్తున్నదా?" అన్నాడు.

అప్పుడు గుణనిధి ఇలా అన్నాడు.

"నిజంగానే వున్నది మహారాజా! ఔషధాలు దేహానికి స్వస్థత చేకూర్చాలన్న ప్రయోజనంతో చేయబడినవే అయినా, అవి చేదుగా వుండాలన్న నిబంధన ఏ వైద్యశాస్త్రంలోనూ లేదు కదా! కాని, మందు ఎంత చేదుగా వుంటే, అంత త్వరగా గుణం యిస్తున్నది. ఈ నిజం స్వానుభవంతో తమరు యిప్పటికే గ్రహించారు!

"ఇదే సత్యం పాలకులు తీసుకునే నిర్ణయాలకు కూడా వర్తిస్తుంది. వాస్తవానికి పరిపాలనకి సంబంధించిన నిర్ణయాలన్నీ కఠినంగా నలుగుర్నీ బాధించేవిగా వుండాలని ఏ రాజనీతిలోనూ వ్రాసిపెట్టక పోయినా, ప్రభావం చూపించి సత్వర ఫలితాలను ఇచ్చే నిర్ణయాలన్నీ అదే మాదిరిగా వుంటాయి.

"ఇంతకీ చెప్పవచ్చే దేమిటంటే, పరిపాలనా యంత్రాంగం కూడా ఒక విధంగా పోల్చి చూస్తే, మనిషి శరీరం లాంటిదే! దాన్ని అవినీతి, అవిధేయత, అసమర్థత వంటి రోగాలు తరుచూ పట్టి పీడిస్తూ ఉంటాయి. అటువంటి జాడ్యాలకి మీరు తీసుకొన్న చేదు నిర్ణయాలు సరైన మందులాగా ఎలా పని చేసినదీ యిప్పుడు ఉద్యోగుల ప్రవర్తనలో మనం చూస్తూన్న మార్పు చెప్పకనే చెపుతున్నది కదా!"

చందనవర్మ అవునని తలవూపి, గుణనిధి విజ్ఞతని మనసులోనే అభినందించి, అతడు ఇచ్చిన సలహాలతో తగిన నిర్ణయాలు తీసుకొని, రాజ్యపాలన చేస్తూ గొప్ప పాలకుడిగా పేరు తెచ్చుకున్నాడు.



## పాఠకులకు మనవి

అనివార్యకారణాలవల్ల ఈనెల బొమ్మరిల్లులో స్టిక్కర్ అందించలేకపోతున్నందుకు క్షంతవ్యులం! —ఎడిటర్.




## నూరుకట్ల పిశాచం చెప్పిన 60వ కథ

# పంచకళ్యాణి

వసుంధర

ఒకానొకప్పుడు కళింగరాజధానికి సమీప గ్రామంలో విద్యాధరుడనే యువకుడు వుండేవాడు. అతడికి యుద్ధ విద్యల్లో ఆరి తేరి రాజు కొలువులో సైనికుడిగా చేరాలన్న కోరిక ఉండేది. అందుకని తానువున్న వూళ్ళో అంతో యింతో యుద్ధవిద్యలు తెలిసిన వారందరికీ శుశ్రూష చేస్తూ వారు నేర్పింది నేర్చుకోసాగాడు.

అలా కొంతకాలం గడిచేక, అతడికి విద్య నేర్పే వారందరూ, "మాకు వచ్చిం దేదో నీకు నేర్పాం. రాజుసైన్యంలో చేరా లంటే యిది చాలదు. రాజధానికి వెళ్ళి నేర్చుకో," అన్నారు.

రాజధానిలో యుద్ధ విద్యలు నేర్పే వారందరూ శిష్యుల నుంచి దండిగా డబ్బు తీసుకుంటారనీ, కేవలం శుశ్రూషల వల్ల విద్య నేర్పరనీ విద్యాధరుడికి తెలుసు. అతడి దగ్గర డబ్బు లేదు. ఏం చేయాలా అని ఆలోచిస్తూండగా, అతడికో విశేషం తెలిసింది. శూరసేనుడనే మహావీరు డొకడు వేట కోసం సమీపారణ్యానికి వచ్చి గుడారం వేసుకున్నాడు. అడవి మార్గాన పయనించే గ్రామస్థులొకరిద్దరు అతణ్ణి చూశారు.





శూరసేనుడు వారిని పలకరించి, "మీలో ఎవరికైనా యుద్ధ విద్యలు నేర్చు కోవాలనుంటే, నాకు ఇక్కడ తోడుగా ఉండండి. నా అంతటి వాణ్ణి చేస్తాను," అన్నాడుట.

వాళ్ళకి కత్తిపట్టటమంటేనే భయం. అడవిలో కూడా అట్టే ప్రమాదంలేని మార్గ మొకటుంది కాబట్టి — తప్పనిసరి పరిస్థి తుల్లో వారా దారిలో పయనించారు.

విద్యాధరుడు ఈ కబురు తెలియగానే హుటాహుటిన అరణ్యానికి బయలుదేరి వెళ్ళాడు. అక్కడ కొంత శ్రమ పడ్డాక, అతడికి శూరసేనుడి గుడారం కన బడింది. విద్యాధరుడు శూరసేనుడికి నమస్కరించి తన ఆశయం చెప్పుకున్నాడు.

"యుద్ధవిద్యల పట్ల నీ ఆసక్తికి మెచ్చు కుంటున్నాను విద్యాధరా! కాని, నీ ఆశయం నాకు నచ్చలేదు. వీరుడైన వాడు పరుల పంచన కాక, స్వతంత్రంగా బ్రత కాలి. రాజు కొలువులో చేరాలనుంటే, సైన్యాధికారి కావాలి తప్ప సైనికుడు కావా లనుకో కూడదు. నేను యుద్ధ విద్యలన్నీ క్షుణ్ణంగా అభ్యసించాను. ఈ దేశంలో నన్ను మించిన వీరుడు లేడు. ప్రతిఏటా రాజు నిర్వహించే వీరుల పోటీల్లో పాల్గొని అందరినీ ఓడిస్తూంటాను. అయితే, మన

జూన్
బొమ్మల సంభాషణ
ఫలితాలు—1



ఆండాళు: హేవిటో రేడియో వంటకం అని వేలంవెర్రేగానీ ఆయన చెయ్యే వేరు.

కొడుకు: అమ్మో! నాన్న పారిపోయాడు.

బళ్ళ శ్రీనివాస్, మద్రాసు.

దేశపు సైన్యాధికారి వీరసింహుణ్ణి మాత్రం నేను ఓడించలేక పోతున్నాను. ముఖాముఖి పోరాటంలో మా యిద్దరిలో నేనే మెరుగు. కాని, గుర్రం మీద ఎక్కి పోరాడినపుడు మాత్రం, ఆయన నన్ను చిత్తుగా ఓడించేస్తున్నాడు. దేశానికి సైన్యాధికారిని కావాలని నా కోరిక. అందుకే రాజు ఉప సైన్యాధికారి పదవినిస్తానన్నా అంగీకరించ లేదు," అన్నాడు శూరసేనుడు.

"అయ్యా! నాకంత పెద్ద కోరిక లేదు. సైన్యంలో చేరటానికి తగుమాత్రం యుద్ధ విద్యలు వస్తే చాలు," అన్నాడు విద్యాధరుడు.

"నువ్వు సైన్యంలో చేరాలని ఎందుకు అనుకుంటున్నావు? జీతం కోసమా, లేక నీ శౌర్య ప్రతాపాలు ప్రదర్శించటానికా?" అన్నాడు శూరసేనుడు.





ప్రభా: మా ప్రక్కింటా యన్ని చూస్తే భలే నవ్వొస్తుంది! తెలుసా?

సుధా: మీప్రక్కింటా యన ఏమయినా జోకిస్తా?

ప్రభా: కాదు టీ.వీ ఎనౌన్సర్!

సుధా: !?!?

మన్నవ సుధాకర్,
విజయవాడ.

"కారణంవుంది. త్వరలోనే రాజధానిలో వీరుల మధ్య పోటీలు జరుగుతాయి. ఈసారి సైన్యాధికారి వీరసింహుణ్ణి చిత్తు చేయాలన్న గట్టి పట్టుదలతో ఉన్నాను. అందుకు బాగా అభ్యాసం కావాలి. యుద్ధ విద్యలో అభ్యాసానికి పోటీవీరుడు కావాలి. వీరసింహుడు నాపై నిఘా ఏర్పాటు చేసి, నాతో పోటీవీరులు తలపడకుండా ఏర్పాటు చేశాడు. అతడి అధికారానికి భయపడి ఎవ్వరూ నాకు సహకరించటంలేదు. అందుకే అతడి చారుల కన్ను గప్పి, ఎలాగో ఈ అడవికి చేరుకున్నాను," అన్నాడు శూరసేనుడు.

"ఈ అడవిలో అభ్యాసానికి వీలవుతుందా?" అన్నాడు విద్యాధరుడు.

"అసలు కీలకం అక్కడే ఉంది. వీరసింహుడు నన్ను జయించటానికి కారణం అతడి గుర్రం. ఆ గుర్రం తన రౌతును రక్షించటానికి ప్రత్యేక శిక్షణ పొందింది. అతడునన్ను దెబ్బతీయటానికీ, నా దెబ్బలు తప్పించుకునేందుకూ వీలుగా అది కదులుతూంటుంది. అతడి గుర్రాన్ని ఆ విధంగా తయారు చేయటానికి ప్రత్యేకమైన అశ్వశిక్షకులు ఉన్నారు. నా గుర్రానికి ఎక్కడా అశ్వశిక్షకులు లభించకుండా వీరసింహుడు కట్టుదిట్టం చేశాడు," అన్నాడు శూరసేనుడు.

అప్పుడు విద్యాధరుడు గుడారానికి కొస్త దూరంగా కట్టి వేయబడి ఉన్న ఓ గుర్రాన్ని చూచి,"అదేనా మీ గుర్రం" అని అడిగాడు.

"అది మామూలు గుర్రం కాదు. అద్భుత శిక్షణ కలిగిన పంచకళ్యాణి. నేను దానికి సరైన శిక్షణ యివ్వలేక పోతున్నాను. అందుకే ఈ పర్యాయం దాన్ని ఇక్కడికి తీసుకొచ్చాను. ఈ అడవిలో బాగా లోపలకు

శౌర్య ప్రతాపాలు ప్రదర్శించటం నాకు ఇష్టం. అందుకు వీలుపడే కొలువు నాక్కావాలి. అయితే, అధికారం మీద నాకు మోజులేదు," అన్నాడు విద్యాధరుడు.

"నువ్వు నాకు నచ్చావు. నేను సైన్యాధికారినైనప్పుడు, నిన్ను ఉపసైన్యాధికారిని చేస్తాను. నీకు యుద్ధ విద్యలు నేర్పుతాను," అన్నాడు శూరసేనుడు.

"తమరు నాకు నిజంగా యుద్ధవిద్యలు నేర్పుతారా? నానుండి ప్రతిఫలమాశించటానికి బదులు నన్నే ఉప సైన్యాధిపతిని చేస్తా నంటున్నారు. ఇందుకు కారణం ఏమిటి?" అన్నాడు విద్యాధరుడు ఆశ్చర్యంగా.







వెడితే భయంకర సర్పాలు, క్రూర మృగాలు, కొండచిలువలు ఉంటాయి. రోజూ కాసేపు గుర్రంమీద అక్కడ మసలి వస్తున్నాను. అక్కడ అనుక్షణం ప్రమాదమే! ఆ ప్రమాదాలన్నీ తప్పించుకుని రాగలిగితే, అదో పెద్ద విశేషం. అదే నా పంచకళ్యాణికి శిక్షణ. చెట్లకు వ్రేలాడే కొండచిలువలను, నేల మీద పాకే విష సర్పాలను, పొంచి ఉన్న క్రూరమృగాలను తప్పించుకుని బైట పడటంలో నాతో పాటు నా పంచక

ళ్యాణీ కూడా శిక్షణ పొందుతూంది. ఈ శిక్షణతో వీరసింహుడి యుద్ధపుటెత్తుల నుంచి నా వంచకళ్యాణీ నన్ను రక్షించ గలదని నా నమ్మకం. ఈలోగ నా కత్తి యుద్ధానికి అభ్యాసంగా నీవంటివాడు కావాలి," అన్నాడు శూరసేనుడు.

"మీ ఆశయం చాలా గొప్పది. మీ శిక్షణ ప్రమాదఘెనది. మీకు శుశ్రూష

జూన్
బొమ్మల సంభాషణ
ఫలితాలు—2



కొడుకు: అమ్మోయ్! నువ్వేమో రేడియోలో చెప్తున్నట్టు చేస్తున్నావ్. వీళ్ళు చెప్పేది వంటకం గురించి కాదు. కొత్త రకం ఎరువుల తయారీ గురించి.

ఎస్.వేదవతీదేవి, చుండూరు.

చేసి నా జీవితం ధన్యమయేలా చేసు కుంటాను," అన్నాడు విద్యాధరుడు.

శూరసేనుడు అతడి వినయానికి,



సంతోషించి ఆరోజునుండే కత్తియుద్ధంలో శిక్షణ ప్రారంభించాడు. విద్యాధరుడు ఏకా గ్రతతో శూరసేనుడు చెప్పే మెలకువ

లన్నీ నేర్చుకోసాగాడు.

"నీవు చాలా ప్రాథమిక దశలో ఉన్నావు. బహుశా ఈ సంవత్సరం వీరుల పోటీలో



పాల్గొనే టందుకు పనికిరావు. అయినప్పటికీ నా శాయశక్తులా ప్రయత్నిస్తాను," అన్నాడు శూరసేనుడు.



రవి: మీనాన్న గొప్ప రచయితటగా?

గోపీ: అవును!..రోజూ వస్తుంటాయి?

రవి: ఏమిటి? మనీ యార్డర్లా. కాంప్లిమెంటరీ కాపీలా?

గోపీ: అవేమీకాదు! కథలు, వ్యాసాలు!

రవి: ఆఁ!?!?

మన్నవ సుధాకర్,
విజయవాడ.

ఇలా ఉండగా ఒకరోజున అనుకోని విశేషం జరిగింది.

వీరసింహుడు నియమించిన చారులిద్దరూ ఎలాగో శూరసేనుడి ఆచూకీ

జూన్
బొమ్మల సంభాషణ
ఫలితాలు—3



తల్లి: ఏంట్రా నానీ రేడియోలో వస్తున్న 'కొత్తవంటకం' మధ్యలోనే ఆగిపోయింది ఎందుకని!?!...

కొడుకు: ఇందాకటి నుండి 'కొత్తవంటకం గూర్చి చెపుతున్నది రేడియోలో కాదు. నాన్న తలుపు చాటునుండి చెప్పి నీచేత 'వంట' చేయిస్తున్నాడు—

కృష్ణశ్రీ, తెనాలి.

తెలుసుకుని అక్కడికి వచ్చారు. ఒక రోజున శూరసేనుడు అజాగ్రత్తగా ఉన్న సమయంలో అతడిపై దాడి చేశారు: శూరసేనుడు వారి దెబ్బలను కాచుకుంటూ ఎలాగైతేనేం తన ఒరలోనుంచి కత్తిదూసి వారిని ఎదుర్కో గలిగాడు. కొసేపటికి ఇద్దరు సైనికులూ బాగా గాయపడ్డారు. అయితే, శూరసేనుడు వారి కుతంత్రాన్ని గమనించలేదు. వాళ్ళు వెనక అడుగు వేస్తున్నట్లు నటించి, అతణ్ణి ముందుగా తవ్వి ఉంచిన నిలువులోతు గోతివైపు నడిపించారు. శూరసేనుడు గోతిలో పడిపోయి చేసేదేమీ లేక హూంకరించ సాగాడు.

అప్పుడు ఆ చారులిద్దరూ దగ్గర్లో ఉన్న గుర్రాన్ని సమీపించారు. వాళ్ళు తనని చంపటానికే వస్తున్నారని కనిపెట్టిన పంచకళ్యాణి పెద్దగా సకిలించి ముందరి కాళ్ళతో వాళ్ళను తన్నటానికి ప్రయత్నించింది. అయితే, చెట్టుకు కట్టేసి ఉన్న కారణంగా తప్పించుకునే అవకాశం లేక ప్రాణభయంతో పదే పదే సకిలిస్తున్నది ఆ అశ్వం. చారులిద్దరూ చెరో కత్తితో ఆ అశ్వాన్ని చంపబోతున్నారు.

సమీపంలోని కొలనులో స్నానానికి వెళ్ళి అప్పుడే తిరిగివచ్చిన విద్యాధరుడు ఆ దృశ్యాన్ని చూచి, పెద్దగా హూంకరించి, కత్తిదూసి చారుల పైకి వెళ్ళాడు. చారులిద్దరూ ఉలిక్కిపడి వెనక్కు తిరిగారు.

"మీ ప్రతాపం నోరులేని జీవాలపై కాదు. నామీద చూపించండి," అన్నాడు విద్యాధరుడు.

అప్పుడు చారులకూ, విద్యాధరుడికీ మధ్య ఘోరంగా పోరాటం జరిగింది. సుశిక్షితులైన చారులు శూరసేనుడితో పోరాడి బాగా గాయపడి ఉన్నారు. విద్యా

ధరుడి కత్తివిద్యలో ప్రావీణ్యం అంతంత మాత్రం. అందువల్ల వారు సమ ఉజ్జీలుగా చాలాసేపు పోరాడారు. విద్యాధరుడు వారి ధ్దర్నీ చంపేశాడు. ఆ తర్వాత, గోతిలో పడ్డ శూరసేనుణ్ణి రక్షించాడు.



శూరసేనుడు విద్యాధరుణ్ణి కౌగలించుకుని, "ఈ రోజు నా పంచకళ్యాణిని రక్షించి నాకు మహోపకారం చేశావు. నీ ఋణం తీర్చుకునేటందుకు తాత్కాలికంగా పోటీలో పాల్గొనేందుకు వీలుగా నీకు కొన్ని మెలకువలు నేర్పుతాను. ఆ తర్వాత తీరుబడిగా నా వద్ద మిగతా విశేషాలు నేర్చుకోవచ్చు," అన్నాడు.

"అంతా మీ దయ," అన్నాడు విద్యాధరుడు.

శూరసేనుడు అతడికి తాత్కాలికంగా పనికివచ్చే కొన్ని కత్తియుద్ధపు మెలకువలు నేర్పడమే కాక, పంచకళ్యాణిపై తగు మాత్రపు స్వారి కూడా నేర్పాడు.

ఆ తర్వాత, గురుశిష్యులిద్దరూ బయలుదేరి రాజధానిలో వీరుల పోటీల్లో పాల్గొనేటందుకు వెళ్ళారు.



జూన్
బొమ్మల సంభాషణ
ఫలితాలు—4



కొడుకు: రేడియోలో వింటూ పిండివంటలు చేస్తున్నావు, నీకు స్వంతంగా చెయ్యడం రాదా అమ్మా!

తల్లి: పెళ్ళికి ముందు వంటలన్నీ వచ్చని చెప్పి మీ నాన్నగారు నన్ను మోసం చేశారు బాబు!

టి .శ్రీధర్, వరంగల్.

విద్యాధరుడు తానూ పోటీల్లో పాల్గొని, ఒకరిద్దర్ని ఓడించి ఆ తర్వాత తానూ ఓడిపోయాడు. శూరసేనుడు మాత్రం ఒక్కొక్కరినే ఓడించుకుంటూ సాటిలేని మేటి వీరుడిగా నిలబడ్డాడు. అప్పుడు వీరసింహుడు శూరసేనుణ్ణి సవాలుచేశాడు.

ఇద్దరికీ కాసేపు భయంకర పోరాటం జరిగింది.

చివరకు వీరసింహుడు శూరసేనుణ్ణి గుర్రం మీదినుంచి పడగొట్టి, తనకత్తిని అతడి గుండెలకు గురి చేసి, "ఇన్ని సార్లు నా చేతుల్లో ఓడావు. ఈ అవమానం నిన్ను దహించివేయటం లేదూ? నేనైతే ఒక్క పరాజయానికే ఆత్మహత్య చేసుకుని ఉండేవాణ్ణి," అన్నాడు.



మాష్టారు: "రవి! పేపర్లో వార్తలేంట్రా..?"

రవి: "సుత్తి కబుర్లతో జీతం డబ్బులు తీసుకొంటున్న ఓ పదిమంది టీచర్లు సస్పెండ్ అయ్యారు సార్!"

మాష్టారు: "ఆఁ!?!?"

-మన్నవ సుధాకర్, విజయవాడ.

ఈ పోరాటాన్ని తిలకిస్తున్న విద్యాధరు డికి ఈ మాటలు ఆవేశం తెప్పించాయి.

అతడు వెంటనే లేచి నిలబడి, "సమర్థులు తమశక్తిని మెరుగు పర్చుకు నేందుకు ప్రయత్నిస్తారు. సాటి వీరుడిగా శూరసేనుడి శక్తిని అభినందించ లేని నీవు నీచుడివి. విజయగర్వంతో నోటి కొచ్చిన విధంగా మాట్లాడే నిన్ను నేను ఓడిస్తాను. అప్పుడు నువ్వు హత్య చేసు కుంటావా? "అన్నాడు.

వీరసింహుడికి ఈ మాటలకు చాలా కోపం వచ్చి, "నేను వీరులతో తప్ప సామా న్యులతో పోరాడను. నేను పోరాటానికి అంగీకరిస్తే అదే వీరులకు గౌరవం. నీతో పోరాడాలంటే -- ఒకే ఒక్క షరతు. ఓడితే నీ ప్రాణాలు నీకు దక్కవు," అన్నాడు.

"అందుకు నేను సిద్ధమే!" అన్నాడు విద్యాధరుడు.

వెంటనే వీరసింహునికీ, విద్యాధరుడికీ యుద్ధం ప్రారంభం అయింది. విద్యాధరుడు పంచకళ్యాణిని అధిరోహించి వీరసింహు డిని ధైర్యంగా ఎదుర్కొన్నాడు. అయితే, అందరూ ఊహించినట్లు వీరసింహుడు విజయం సాధించలేదు. అతడు ఎలాంటి దెబ్బ తీసినా, విద్యాధరుడు సులభంగా తప్పించుకో గలిగేవాడు. విద్యాధరుడు దెబ్బతీసినపుడల్లా వీరసింహుడు గాయ పడుతున్నాడు. కాసేపటికి వీరసింహుడు నేలకూలాడు.

కళింగరాజే పరిణామానికి ఆశ్చర్యపడి విద్యాధరుడి వివరాలు అడిగాడు.

అప్పుడు శూరసేనుడు ముందుకు వచ్చి, "అతడు నా శిష్యుడు. గురువును మించిన శిష్యుడయ్యాడు" అన్నాడు.

విద్యాధరుడు వినయంగా, "అయ్యా! నేను గురువును మించిన శిష్యుణ్ణి కాను. పూర్తి యుద్ధంలో నాకు తెలిసిన మెలకువ అంతంత మాత్రం. నాగురువు శూరసేనుడు తన అశ్వానికిచ్చిన అద్భుత శిక్షణే నన్ను రక్షించింది. అంతా ఈ పంచకళ్యాణి గొప్ప తనమే!" అంటూ అడవిలో జరిగిన విశే షాలన్నీ చెప్పాడు.



శూరసేనుడు ఆశ్చర్యంగా, "ఇది పంచ కళ్యాణి విజయం కాదు. సుశిక్షితుడనైన నన్నే రక్షించలేని ఆ పంచకళ్యాణి నిన్నేమి రక్షించగలదు? ఏ కారణంగానో నీలో దాగి ఉన్న ప్రతాపం విజృంభించింది. ఇది నిస్సందేహంగా నీ విజయం!" అన్నాడు

"కాదు, పంచకళ్యాణికి మీరు శిక్షణని చ్చారు. అది మీకు యుద్ధంలో సహక రించింది. కాని, నేను పంచకళ్యాణి ప్రాణాలు కాపాడాను. ఆ కృతజ్ఞతతో అది పోటీ జరుగుతున్నంత సేపూ నన్ను రక్షించుకు నేందుకు ప్రయత్నించింది. మీరు ఇచ్చిన శిక్షణ నది ప్రాణాలకు తెగించి నాకోసం ఉపయోగించింది," అన్నాడు విద్యాధరుడు.

ఇది విని అంతా ఆశ్చర్యపోయారు.

"నోరులేని జీవం కృతజ్ఞతతో తన యజమానికి సహాయపడ్డం వల్ల ఆ యజ మాని మహా శక్తిమంతు డయ్యాడు. నా ప్రజలందరూ నాపట్ల అలాంటి కృతజ్ఞత కలిగి ఉంటే ఈ లోకంలో నాకు ఎదురే ఉండదు. ఈరోజు నుంచీ నా ప్రజల మేలుకోసం నా యావచ్ఛక్తినీ వినియో గిస్తాను," అంటూ కళింగరాజు, వీర సింహుణ్ణి బాగా మందలించి, శూర సేనుణ్ణీ, విద్యాధరుణ్ణీ తన కొలువులోకి తీసుకున్నాడు.

ఎన్నో యేళ్ళ శిక్షణ కంటె, కరుణతో విద్యాధరుడు చేసిన ఒక్క కార్యం అతడికి విజయం సాధించిపెట్టిందని గ్రహించిన శూరసేనుడు సైన్యాధికారి కావాలన్న ఆశయం వదలిపెట్టి, రాజు కొలువులో చేరి సాధ్యమైనంతలో సాటివారికి సహాయ పడుతూ కలకాలం సుఖంగా జీవించాడు.

వినయశీలుడి కథ పూర్తి కాగానే, 'ఈ కథలో రాజ్యపాలన గురించిన ముఖ్య హెచ్చరిక ఉంది. అది పాటించాలి' అను కుంటూ వెళ్ళిపోయింది మహారాణి.

జూన్
బొమ్మల సంభాషణ
ఫలితాలు—5



తల్లి: "ఒరేయ్ చంటి రేడి యోలో వచ్చే పిండి వంట తయారు చేస్తున్నా గానీ నువ్వు అల్లరి చేయకు."

చంటి: అమ్మోయ్! అది సీరియల్ పిండివంట ఈ వారం సగం, వచ్చే వారం సగం చెబుతారు!?

జి.వి.వి.సత్యనారాయణ, అత్తిలి.



మర్నాడు యథాప్రకారం యథా స్థలంలో యథాసమయానికి వినయశీలు డిని ఆవహించుకొని ఉన్న నూరుకట్ల పిశాచం మహారాణికి మరో కథను విని పించ సాగింది
—(వచ్చే నెల మరో కథ)




## 6

[మలయవాహన మహారాజుకి చిలుకరూవు నుండి మానవుడిగా మారిన కుమారకేసరి తన కథ చెప్పడం ప్రారంభిస్తాడు. రత్నరాసులు సంపాదించడానికి లంకానగరం ప్రయాణమయ్యాడు కుమారకేసరి. దారిమధ్య కాపాలికుడు ఇచ్చిన ఖడ్గాన్ని జూదంలో పెట్టి యక్షుడిదగ్గర విమానం పొందుతాడు. అనేక దిశల ప్రయాణించి చివరకు రత్నఖచితమైన ఒక భవనప్రాంగణంలో కుమారకేసరిని విడిచి అదృశ్యమౌతుంది ఆ విమానం. —తరువాత]

అక్కడ ఒక మందిరం కనిపించింది సూర్య కిరణాలతో స్తంభాలు చేసి నిర్మించారా అన్నట్లు ఆమందిరం బంగారు కాంతులతో ధగధగ మెరుస్తున్నది. ద్వారాలలో పగడాల బొమ్మలున్నాయి. గోడల్లో గరుడపచ్చలు పొదిగి ఉన్నాయి. సముద్రంలోగల రత్నాలన్నీ తెచ్చి దాన్ని నిర్మించారేమో అనిపించింది. ఇంక అక్కడ వున్న రకరకాల జంతువుల చిత్రాలు ఎన్నో చెప్పలేము.

ఆ మందిరాన్ని చూడటంతోటే నా సందేహం తొలగిపోయింది. మనస్సుకు ఉల్లాసం కలిగింది. నాకండ్లు ఆనందంతో మెరిశాయి. మెల్లగా ఆ మందిరం లోపలకు వెళ్ళాను. అక్కడ వున్న శివలింగానికి చేతులు మోడ్చాను. నా కోరిక నెరవేరాలని సాష్టాంగపడి మ్రొక్కాను. నాకు వచ్చిన స్తోత్రాలు వల్లించాను. ఆ తర్వాత, కొంచెంసేపు విశ్రాంతి తీసుకోవాలనుకొని, ముఖమంటపం దగ్గరకి వచ్చి, అక్కడ మాణిక్యాలు పొదిగిన అరుగు మీద హాయిగా కూర్చున్నాను.

ఇంతలో ఆ ప్రాంతంలో కాలి గజ్జెల సవ్వడులు వినిపించాయి. నామనస్సు వేగిర పడ్డది. రకరకాల రంగుల పావడాలు, పైటలు ధరించిన అందాల భరిణెలయిన కన్యలు ఒయ్యారపు నడకలతో అక్కడికి వచ్చారు.

ఆ కన్యల నడుములకు మణులు పొదిగిన బంగారు ఒడ్డాణాలు వున్నాయి. వారి చేతులలో విలాసానికి పట్టుకున్న కలువపూలు



వున్నాయి.

ఆ కన్యల మధ్య వారి నాయిక కాబోలు ఒక సౌందర్యరాశి తెల్లని ముత్యాల గొడుగు క్రింద నిలుచున్నది. వంకులు తిరిగిన ఆమె ముంగురులు ముల్లోకాలను మోహింప జేసేటట్లు వున్నాయి. బంగారు కాంతితో బ్రహ్మ దేవుడు ఆకన్యను మనోహరంగా సృష్టించినట్లు కనిపిస్తున్నది.

ఈ త్రిలోకసుందరి ఎవరు? ఊర్వశికి చెల్లెలా? నలకూబరుడి మరదలా? జయంతుడి మేనకోడలా అని నేను ఆశ్చర్యంతో చూస్తుండగా, ఆ కన్యల నడుమ నడుస్తూ ఆక్కడి ఉద్యానవనంలోనికి వెళ్ళింది. కన్యలందరు పువ్వులు కోయసాగారు. ఆ త్రిలోకసుందరికి గొడుగు పట్టిన యువతి తన గొడుగును ముడిచి మంటపంలోనికి వచ్చింది. ముడిచిన ముత్యాల గొడుగును ఒకమూలపెట్టి, పట్టువస్త్రం కప్పిన ఈ పటాన్ని గొడుగుచాటున ఉంచి,గబగబ మెట్లుదిగి పరుగెత్తి తన వాళ్ళను కలుసుకున్నది. అక్కడనే కూర్చున్న నన్ను ఆమె చూడనేలేదు.

గొడుగు పెట్టిన యువతి పట్టువస్త్రంలో కప్పి పెట్టిన వస్తువు ఏమిటో చూడాలని నాకు కుతూహలం కలిగింది. ఆ కన్యలందరూ పూలు కోయటంలో నిమగ్నమయ్యారు. నన్ను వాళ్ళు గమనించనే లేదుకదా అని మెల్లగా లేచి ఆ మూలకు వెళ్ళి ముత్యాల గొడుగు మాటున ఉన్న పట్టు వస్త్రాన్ని ఊడదీశాను. అందులో ఒకపటం ఉంది.

ఒకవైపు మీరూ,దానికి దిగువ ఆ త్రిలోక సుందరి చిత్రమూ ఉన్నది. మీ యిద్దరి చిత్రాలు పదేపదే చూచి, ఈఅందగాడికి ఈ సుందరి తగును,ఈ సుందరాంగికి ఈవన్నెకాడు తగును, అని నిశ్చయించుకొన్నాను. ఆ అపురూప దంపతుల చిత్రాలను కన్నార్పకుండా చూస్తూ పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నాను.

ఎక్కడినుంచో ఒక వృద్ధురాలు మెట్లెక్కుతూ వచ్చి నేను కూర్చున్న చోటును దాటి లోనికి వెళ్ళింది. హఠాత్తుగా అక్కడ ఆగి నన్ను చూచి, పాపిష్టుడా! ఎంతపనిచేసావు? అన్నది.

నేను అప్పుడు వెనుదిరిగి చూచాను. ఆవృద్ధురాలు శరీరం అంతటా భస్మం పూసుకొన్నది



ఆమె వెంట్రుకలు జడలుకట్టి ఉన్నాయి. ఆ తాపస స్త్రీని చూచేసరికి నా గుండెలు అవిసిపో యాయి. గభాలున లేచి నిలుచున్నాను.

"అప్పుడు ఆమె,ఓరీ!మనుమ్యడా! పశువులా గా ప్రవర్తించావు. ఎందుకు ఇంతటి నీఛమైన పనికి పూనుకొన్నావు? నీవిప్పుడు చేసిన ఈ నీఛమైన పనికి తగిన ఫలం అనుభవించక తప్పదు. నీవు చూడటానికి మనుమ్యడవు. కాని, నీవు చేసినది పశువులు చేసే పని. కాబట్టి నీవు పక్షి కులంలో పుట్టుదువు గాక! నీవిప్పుడు పగులగొట్టిన మాణిక్యపు చిప్ప వంటి ముక్కు తోనే నీవు చిలుకవై కాలం గడుపుదువు గాక! ఈ పటం నీ తలమీద కుచ్చుగా మొలచును గాక! అని ఆవేశంతో శపించింది.

శాపవాక్కులకు అదిరిపడి, నేనేమి తప్పుచే శానా అని తలవంచి, కిందికి చూచాను. అక్కడ పరిచిన జింక చర్మం మీద నా కాలి కిందపడి బ్రద్ధలైన మాణిక్యపుచిప్ప కనిపించింది.

"అయ్యో! పటాన్ని చూడటంలో తొందరపాటు ఎంత హాని కలిగించింది! మాణిక్యపుచిప్ప కాలి క్రింద పడినట్లుగా కూడా గ్రహించలేకపోయాను. నాకర్మకు తగిన ఫలం కలిగింది. ఇదంతా నేను పూర్వజన్మలో చేసుకొన్న పాపఫలం కాక మరొకటి కాదు. ఈ శాపంవల్ల ఎంత దుఃఖం కలిగినా అనుభవించక తప్పదు అని అనుకొన్నాను.

"కాని, ఆ సుందరి ఎవరు? ఎవరి కూతురు? ఎక్కడ వుంటుంది? పేరేమిటి? ఈ పటంలో చిత్రింపబడిన సుందర పురుషుడెవరు? అనేదే నా మనస్సులో ఉన్న ఆరాటం. నేనీ పరిస్థితిలో ఉండగా, వద్ధురాలి కోపవాక్కులు విని పూలు కోస్తున్న ఆ సుందరి పరిగెత్తుకొని హడావుడిగా అక్కడికి వచ్చింది. నన్నూ నాచేతిలో ఉన్నపటం పగిలిపోయిన మాణిక్యపు చిప్పను ఎగాదిగా చూచి, ఆశ్చర్యంతో అలాగే నిలిచిపోయింది.

కొంచెం సేపయ్యాక, ఆ వృద్ధురాలిని చూచి, భగవతీ! నీకు కూడా ఇంత కోపం వస్తే ఎలా? అమృతం కురిపించే నీకళ్ళల్లో పిడుగులు వర్షి స్తున్నాయి. ఇంద్రియాలను జయించిన దానవు. నీ విప్పుడు నిన్ను నీవు మరచిపోయి ఈ దీనుణ్ణి ఇంత కఠినంగా శపించవచ్చునా? నిజానికి ఇతడు చేసిన తప్పేమిటి? మాణిక్యపు చిప్పను పొర



పాటున త్రొక్కాడే కాని, చూచి తొక్కలేదు. అదీకాక,సర్వసంగాలు వదులుకొన్న నీవు ఈ చిన్న చిప్పను వదులుకోలేక పోవటం ఆశ్చర్యంగా

నీవీ చిప్పనే కాదు, అంతకంటె ఎంతో గొప్ప దైన శాంతాన్ని పోగొట్టుకొన్నావు. జరిగినదేదో జరి గింది. నిర్మలమైన హృదయంతో ఇతణ్ణి అను గ్రహించు. ఇతడి పక్షాన నిన్ను నేను ఒకటి ప్రార్థిస్తున్నాను. ఇతడు నీ శాపంవల్ల పక్షిజాతిలో పుట్టినప్పటికీ మానవచైతన్యం ఉండేటట్లుగా అనుగ్రహించు,"అని బతిమాలింది ఆ సుందరి.

వృద్ధురాలికి నామీద దయ కలిగింది. ఆ సుందరిని చూచి, "అమ్మాయీ! నీవు కోరిన ట్లవుతుంది," అని చేయెత్తి దీవించింది. ఈ పటం ఇతడి తలమీద పెరిగేకొద్దీ, ఇతడికి వివేకం కూడా వృద్ధి అవుతుంది. పుణ్య పురు షుడైన ఒకమహారాజు యొక్క ఆస్థాన మంట పంలో ఇతడి చిలుకముక్కు బ్రద్దలైనప్పుడు ఇతడి చిలుకరూపం పోతుంది. నిజరూపం సిద్ధిస్తుంది, అని ఆ వృద్ధయోగిని శాపాంతం ప్రసాదించింది.

"ఆ శాపంవల్ల నాలో చైతన్యం నశించింది. గాఢాంధకారం వ్యాపించినట్లయింది. ఆ తర్వాత నేనెవణ్ణో,ఎక్కడున్నానో, ఎలా ప్రవర్తించానో ఏమీ తెలుసుకోలేక పోయాను. ఇప్పుడైతే మనోహర మైన మీ రూపం చూచిన వెంటనే, నేను అప్పుడు పటంలో చూచిన పురుషుడు ఇతడే అని సంతోషంతో మీ ఆస్థానానికి పరుగెత్తుకు వచ్చాను.

"ఈ పటంలో చిత్రించిన త్రిలోకసుందరి అయిన కన్యను చూపించాను. గతంలో నేను అనుభవించిన విషయమంతా తమకు విన్న వించాను. సంసార దుఃఖ సముద్రంలో ఈదు లాడుతున్న నాకు మీ పరిచయమనే రత్నం లభించింది."

"మహారాజా! నా మాటలను దయతో నమ్మగోరుతున్నాను. మీ పటం తన దగ్గర పె ట్టుకొని ఆ సుందరి ఈశ్వరుడ్ని సేవిస్తున్నది. మీ మీద ఆమెకు అనురాగమున్నదని వేరే చెప్పవని లేదు. మిమ్మల్ని భర్తగా కోరుకొని ఆమె విరహంతో వేగిపోవుచున్న దనటంలోనూ సందేహం లేదు. ఆ సుందరి కోసం తపస్సు చేసినా



తప్పులేదని నేను అనుకొంటున్నాను!"

ఇలా అని కుమారకేసరి చెప్పి మౌనంగా కూర్చున్నాడు.

"ఆశ్చర్యం! మహాశ్చర్యం! అత్యద్భుతమైన విషయం చెప్పి కుమారకేసరి నా మనస్సులో ఉన్న వేదనను తొలగించాడు. ఇప్పుడు నా మనస్సు తేలికపడ్డది. కాని, ఈ మహా ప్రపంచంలో నాకు ఆసుందరి ఎక్కడ కనిపిస్తుంది? కనిపించినా, ఆమె నాకు ఎలా లభిస్తుంది? ఇప్పుడు దీన్ని గురించి ఆలోచించవలసిందేమీ లేదు. ఎంతటివారైనా దైవ నిర్ణయానికి దాసోహమనక తప్పదు. ఆ సుందరిని పొందే ప్రాప్తముంటే భగవంతుడే నాకు సమకూరుస్తాడు," అనుకొని మలయవాహన మహారాజు కుమార కేసరి వీపుతట్టి, "లే ఇక వెళదాం," అన్నాడు.

అప్పుడు అక్కడికి వచ్చిన వసంతశీలుడికి బహుమానమిచ్చి, కుమారకేసరితో పాటు ఆ మణిమండపం నుంచి బయలు దేరాడు మహారాజు.

మహారాజు రాకకు ఎదురు చూస్తున్న సామంతరాజులు వెనుక నడుస్తూండగా మలయవాహనుడు తన గుఱ్ఱం ఎక్కి, వెనుక కుమార కేసరిని కూర్చుండబెట్టుకొన్నాడు. ఇద్దరూ నగరంలోనికి ప్రవేశించారు.

మలయవాహనుడు సంధ్యాకాలపు పూజలు చేసి, మేడ పైభాగానికి చేరుకొన్నాడు. అక్కడ ఎవ్వరూ ఉండరు. ద్వార పాలకులు కూడా అక్కడికి రారు. మేడపైభాగాన చుట్టూ గోడలు లేవు. విలాసమండపం ఉంది. ఆ మండపంలో హంస తూలికా తల్పంమీద మలయవాహనుడు మేను వాల్చాడు.

చంద్రోదయమయింది. చిత్రపటంలోని సుందరి మహారాజుకు జ్ఞాపకం వచ్చింది.

ఆ కన్య నాకు ఎలా లభిస్తుంది? దీనికేమిటి ఉపాయం? ఇప్పుడు నేనేమి చేయాలి? ఎక్కడికని పోవాలి? ఎక్కడ ఆమెఉన్నదని వెదకాలి? నాకీ విషయంలో సలహా చెప్పేవారు ఎవరు? అని ఆలోచిస్తూ పడుకొన్నాడు.

ఇలా మహారాజు ఊహాలోకాలలో విహరిస్తూ వుండిపోయాడు. ఆ సుందరి స్వర్గలోకంలో

ఉంటుందా? ఆమె కోసం సముద్రాలను పర్వతాలను దాటటానికి గానీ, ఆకాశాన సంచరించటానికి గానీ భూమండలాన్ని దాటి పోవటానికి గానీ వెనుదీయ గూడదని నిశ్చయించాడు.

మహారాజుకు ఆ సుందరిపట్ల వ్యామోహం అంతకంతకూ అధికమయింది. చంద్రకిరణాలను త్రాళ్ళుగా భావించి, వాటిని పట్టుకొని, ఆకాశానికి చేరుకోవాలని వ్రేలాడబోయాడు. అక్కడ సమీపంలో ఉన్న సరోవరం మీది నుంచి వచ్చే చల్లని గాలులు అన్ని దిక్కులకు ప్రయాణిస్తాయని ఆగాలులమీదికి ఎక్కబోయాడు. సరోవర జలంలో ప్రతిబింబిస్తూన్న చంద్రబింబాన్ని చూచి, అది పాతాళలోకానికి త్రోవ అనుకొని దూకబోయాడు. ఈ విధమైన భ్రమతో కొంతసేపు ఆసాధం మీద అటూ ఇటూ తిరిగాడు మహారాజు.

ఇంతలో కారుచీకటి నలువైపుల క్రమ్ముకొన్నది. వర్షాకాలంలోని నల్లని మేఘాలు ఆవరించి నట్లయింది. కాని, అది వర్షఋతువు కాదు. కాటుకకొండ బ్రద్దలైనట్లు, ఎవడో ఇంద్రజాల విద్యతో మాయచీకటిని ప్రవేశపెట్టినట్లుగా అంధకారం నలువైపుల క్షణంలో అలముకొన్నది.

మరి కొంచెం సేపటికి, ఆ చీకటి అంతా ఉత్తర దిక్కుకు చేరుకొన్నది. ఒకచోట వెన్నెల, మరొకచోట చీకటి ప్రోగు పడటం చూచిన మలయవాహనుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. ఇంతలో, ఆ వైపునుంచి దీనాలాపనలు అదే పనిగా వినిపించసాగాయి. మహారాజు హృదయం కరిగింది.



దీనుల్ని రక్షించలేకపోతే,నా రాచరికం దేనికి? అని అనుకొన్నాడు మహారాజు.

చీకటి ఆకాశం నుంచి భూమిమీద ఒకవైపుకు దిగడమేమిటి? ఆ మూలనుంచి ఆర్తనాదం ఎడతెగకుండా వినిపించడ మేమిటి?

'ఆ దీనుణ్ణి రక్షించటం ఇప్పటి నా కర్తవ్యం,' అని అనుకొని మలయవాహనుడు గబగబ మేడ మెట్లు దిగి, ఆయుధశాలకు వెళ్ళి కవచఖడ్గాలను ధరించి, రహస్య మార్గాన కోట విడిచి ఉత్తరదిశకు వెళ్ళాడు.

ఉత్తర దిక్కున కాటుక కొండలా ప్రోగుపడిన

నల్లని చీకటిని చూస్తూ చాలా దూరం నడిచాడు మహారాజు. పోగా పోగా, అక్కడొక శ్మశానం ఉంది. దానికి దగ్గరలోనే దుర్గాదేవి ఆలయం ఉంది. ఆ ఆలయానికి కొంచెం దూరంలో రావి చెట్టు వెనుక పెద్ద చీకటి బావి ఉంది. ఆ బావి గట్టున చీకటి కొండలాగా ఒక పెద్ద రాక్షసుడు నిలుచున్నాడు.

అతడి మెడలో పుర్రెదండలున్నాయి. అతడు త్రాగిన రక్తంతో తడిసి ఆ పుర్రెలు ఎర్రడ్డాయి. అతడి గుండెలమీద నెత్తురు ముద్దకట్టి ఉంది. అతడి ఎడమభుజం మీద ఒక అస్థిపంజరం వ్రేలాడుతున్నది. అతడి కోరలనుంచి పచ్చి మాంసపు తునకలు వెలికి వచ్చి క్రింద పడుతున్నాయి.

ఆ భయంకర రాక్షసుడు అక్కడవున్న చీకటి నుయ్యిలో నుంచి పదహారు ఏళ్ళ కన్యను బలాత్కారంగా బయటికి లాగుతున్నాడు. ఆ కన్య హాహాకారాలు చేస్తున్నది. ఆమె ఒక బాల యోగినిలాగా ఉన్నది. మలయవాహనుడు మెల్లగా అక్కడికి వచ్చి ఆ ఘోరదృశ్యాన్ని చూచాడు.

"రక్షించండి రక్షించండి!"అని ఆకన్య పెద్దపెట్టున అరిచింది.

"అభయం అభయం" అంటూ మలయవాహనుడు కత్తి దూసి, ఒక్క ఉదుటున అక్కడికి దూకాడు.

రాక్షసుణ్ణి చూచి, ఓరీ! పాపిష్ఠుడా! ఆ కన్యను వదలిపెట్టు. ఈ శ్మశానం చాలా పెద్దది. కాలం తీరిన వాళ్ళు ఇక్కడ దొరుకుతారేమో వెతుక్కో. ఇక్కడినుంచి తొలగిపో," అని గద్దించాడు మలయవాహనుడు.

మహారాజు ఇంత నిర్భయంగా తన ఎదుట నిలిచి గర్జించటం చూచి,ఆ రాక్షసుడు ఆశ్చర్యపోయాడు. ఆరాజును నఖశిఖ పర్యంతం కరిశీలించి చూశాడు. ఆరాజు చక్కదనానికి ఒక్క క్షణం ఆచ్చెరువొందాడు ఎంత అందగాడు?

—(ఇంకా ఉంది)





# పరోపకారి

చాలాకాలం కిందట ఒక రాజు వుండేవాడు. ఆయన వివేకాన్ని గురించీ, ధర్మ పరిపాలన గురించీ దేశంలోని వారంతా కథలుగా చెప్పుకునేవారు. వేగులవాళ్ళ అవసరం లేకుండానే, ఆయన తన రాజ్యంలో జరిగే స్వల్పసంఘటనలను కూడా తెలుసుకోగలిగేవాడు. ఏదో కర్ణపిశాచిలాటిది వుండి, ఆయనకు సర్వం వినిపిస్తున్న దనుకునేవాళ్ళు కొందరు. ఆయనకు ఒక విచిత్రమైన అలవాటుండేది. రాత్రి భోజనం ముగిశాక, తన పడక గదికి పోయి, నౌకరు ద్వారా వంటగది నుంచి ఒక చిన్న పాత్ర తెప్పించేవాడు. ఆ పాత్రలో వున్న పదార్థమేమిటో ఎవరికీ తెలియదు. నౌకరు ఆ పాత్రను తెచ్చి రాజుకిచ్చి బయటికిపోయేవాడు. ఆ తరవా రాజు దాని మూత తీసి అందులో ఉన్న వంటకాన్ని తినేవాడు.

రాజమందిరంలో రాజుకు అంతరంగికుడుగా ఒక యువకుడు వుండేవాడు. ప్రతిరోజూ రాత్రి పూట భోజనం కాగానే వంటగది నుండి ఒక పాత్రతో నౌకరు ఏదో వంటకాన్ని తీసుకుపోవడం దాన్ని మూతతీసి రాజు తినడం ఆ యువకుడు రహస్యంగా గమనించాడు. రోజు రోజుకి ఆ యువకుడికి ఆ పాత్రపట్ల పెరుగుతున్న కుతూహలాన్ని రాజు గమనించాడు.

ఇలా చాలాకాలం జరిగింది. ఒకనాడు యువకుడికి ఆ పాత్రలో ఏమున్నదో చూడాలని బుద్ధిపుట్టింది. రాజు పాత్రను తెప్పించి కొద్దిసేపటి తరువాత గదినుంచి బయటికి పోయిన యువకుణ్ణి పిలిచి, దాన్ని అతడి కిచ్చాడు. యువకుడు పాత్రను తనుండే గదికి తీసుకుపోయి మూత తెరిచి చూశాడు. అందులో అతడికొక విచిత్రమైన చేప కనిపించింది. దాని రుచి ఎలా వుంటుందో చూద్దామని అతడు కొంచెం కొరికి నమిలాడు. ఆ వెంటనే అతడికి గది కిటికీ పక్కన ఏదో కిచకిచమన్న శబ్దం వినిపించింది. అతడు కిటికీ పక్కకుపోయి బయటికి

కోగంటి వత్స.



తొంగి చూశాడు. రెండు పిచ్చుకలు తాము ఆరోజు చూసిన విశేషాలు చెప్పుకుంటున్నవి. యువకుడు తనకు పక్షుల, జంతువుల భాష అర్థం చేసుకునే శక్తి వచ్చిందని గ్రహించాడు.

రెండు, మూడు రోజులు గడిచాయి. రాణీగారి రవ్వల ఉంగరం కనబడకుండా పోయింది. రాజభవనంలోని అన్ని గదులూ నిరాటంకంగా తిరుగుతుండే యీ నమ్మకస్తుడైన యువకుడి మీద రాజుగారికి అనుమానం కలిగింది. ఆయన యువకుడిని పిలిచి, ఆ రవ్వల ఉంగరం దొంగిలించిన వాళ్ళెవరో మర్నాటికల్లా కనుక్కొని ఉంగరం తెచ్చి యివ్వకపోతే ఉరిశిక్ష విధిస్తానన్నాడు. యువకుడు తను దోషి కాదనీ, దొంగ ఎవరో కనుక్కోవటం తనకు సాధ్యమయే పని కాదనీ రాజుకు విన్నవించుకున్నాడు. రాజు అతడి మాటలు ఏమీ వినక, పోయి ఉంగరం తెమ్మన్నాడు.

యువకుడు ఏమి చేయటానికీ తోచక ఉద్యావనంలో వున్న కొలను దగ్గిరకు పోయి కూర్చున్నాడు. అక్కడ కొన్ని బాతులు కొలనులో చాలాసేపు ఈది, ఒడ్డుకు వచ్చి, ఈకలను ముక్కుతో దువ్వుకుంటూ తమలో తాము సంభాషించుకోసాగినై. యువకుడు వాటి సంభాషణను శ్రద్ధగా ఆలకించసాగాడు. బాతులు తాము ఆ రోజున ఎక్కడఎక్కడ తిరిగిందీ, ఎలాటి ఆహారం సంపాయించిందీ మాట్లాడుకుంటున్నాయి.

ఆ సమయంలో ఒక బాతు, "ఏం ఆహారమో ఏమో! ఉదయాన రాణీగారి గది కిటికీ కింద నుంచి పోతుంటే, ఆమెగారి చేతి ఉంగరం జారి కిందపడింది, ఆకలిమైకంలో అదేమిటో చూడకుండానే మింగేశాను. అది పొట్టలో చేరి యింకా బాధపెడుతూనే వున్నది," అన్నది.

"అమ్మ దొంగా! దొరికావ్!" అంటూ యువకుడు ఎగిరి గంతేసి, ఆ బాతుని పట్టుకుని రాజుగారి వంటగదికి తీసుకుపోయి, అక్కడ వంటవాడితో, "దీన్ని వెంటనే కొయ్యి. బాగా కొవ్వుపట్టి వున్నది!" అన్నాడు.

వంటవాడు బాతుమెడ పట్టుకుని ఎత్తి చూసి, "నువ్వన్నట్టు బాగా కొవ్వుపట్టి బరువెక్కింది!" అని దాన్ని కోశాడు. వాళ్ళకు దాని పొట్టలో రాణీగారు పోగొట్టుకున్న రవ్వల ఉంగరం కని

పించింది.

యువకుడు ఆ ఉంగరం తీసుకుపోయి రాజు గారికి చూపించి, తాను నిర్దోషినని రుజువు చేసుకున్నాడు. తొందరపడి అంత నమ్మకస్తుడైన నౌకరును నానామాటలూ అన్నందుకు రాజు కాస్త విచారపడి, అతనికి తన ఆస్థానంలో ఎలాటి ఉద్యోగం కావాలన్నా సరే ఇస్తానన్నాడు.

"మహారాజా! నేను అంతగా చదువుకున్న వాణ్ణి కాదు. అందువల్ల పెద్ద పదవులకు పనికి రాను. దయవుంచి, ఒక మంచి గుర్రమూ, కొంత డబ్బూ యిప్పించండి. కొంతకాలం పాటు దేశయాత్ర చేసి వస్తాను," అన్నాడు యువకుడు.

"సరే, నీ యిష్టం!" అని రాజు యువకుడికి ఒక మంచి గుర్రమూ, కొంత డబ్బూ యిప్పించాడు.

యువకుడు గుర్రం ఎక్కి బయలుదేరాడు. అతడు నగరం దాటి కొంత దూరం పోయాక ఒక చిన్న కాలవ ఒడ్డున మూడు చేపలు గిలగిలా కొట్టుకుంటూ అతడి కంటబడ్డాయి. అవి తమ దుస్థితికి వాపోతూ, త్వరలో చావు తప్పదని తమలో తాము మాట్లాడు కుంటు న్నాయి. యువకుడికి వాటిస్థితి చూసి జాలి కలిగి, గుర్రం దిగి మూడు చేపలనూ కాలవ నీటిలో పడేశాడు.

అవి నీటిలో పడుతూనే ఉత్సాహంగా అటూ యిటూ ఎగురుతూ యువకుడితో, "ఓ పరోప కారీ! నీ సహాయం మరిచిపోము. అవసరం



కలిగినప్పుడు నీకు తప్పక సహాయం చేస్తాము!" అన్నాయి.

యువకుడు అక్కణ్ణుంచి ముందుకు కదిలాడు. కొంత దూరం వెళ్ళాక అతడికి దారి పక్కనించి మాటలు వినిపించాయి. అతడు శ్రద్ధగా ఆలకించాడు. ఒక గండుచీమల రాజు కోపంగా, "ఈ మనుష్యులకు బుద్ధిలేదు. గుర్రాలెక్కి వస్తారు. వాటి కాళ్ళకిందపడి నా పౌరులు ఎంతమంది చచ్చిపోతున్నారో వాళ్ళకు పట్టదు," అంటున్నది.

యువకుడు తన గుర్రాన్ని చీమల దారి నుండి తప్పించి, మరోదారి పట్టించాడు. గండు చీమల రాజు అది చూసి "నువ్వు దయగల వాడివన్న సంగతి మాకు గుర్తుంటుంది.



అవసరం కలిగినప్పుడు నీకు తప్పక సాయం చేస్తాం" అన్నది.

యువకుడు మరికొంత దూరం సాగి, ఒక అరణ్యంలో ప్రవేశించాడు.

అక్కడ ఒక చెట్టు గూటిలోంచి రెండు డేగలు తమ పిల్లల్ని కిందకు తోస్తూ, "ఇకనైనా యీ గూడు వదిలి పొండి. ఏ పీనుగుల్నో పొడుచుకు తిని బతకండి! ఇంకా ఎన్నాళ్ళని మీకు మేం ఆహారం తెచ్చి పెడతాం?" అంటున్నవి.

నేలమీద మూడు డేగపిల్లలూ ఎగిరేందుకు రెక్కలాడిస్తూ, ఎగరలేక, "మాకింకా సరిగా ఎగరటం రాదే! మా ఆహారం మేం ఎలా సంపాయించుకోగలం?" అంటూ వాపోసాగినై.

అది చూసి యువకుడు వాటిమీద జాలిపడి, గుర్రం దిగి ఒరలోంచి కత్తి దూసి, గుర్రం మెడ నరకి, దాని కళేబరాన్ని పిల్లడేగల ముందు పడేశాడు.

డేగ పిల్లలు గెంతుతూ చచ్చిన గుర్రం మీద పడి, ముక్కులతో దాని మాంసం పొడుచుకు తింటూ, యువకుడితో "ఓ పరోపకారీ, నీ సహాయానికి తప్పక ప్రతిఫలం వుంటుంది!" అని చెప్పాయి.

గుర్రం పోయింది గనుక యువకుడు కాలి నడకన బయలు దేరి ఒక నగరం చేరాడు. నగర వీధులన్నీ జనంతో కిక్కిరిసిపోయి వున్నాయి. రాజుగారి భటుడొకడు గుర్రం మీద ఆ జనంలోంచి పోతూ బిగ్గరగా అరిచి యిలా చెపుతున్నాడు:

"రాకుమార్తె తన భర్తను ఎన్నిక చేసుకుంటుంది. ఆమె తను అడిగిన సాహసకృత్యాలు చేసినవాణ్ణి వివాహం ఆడుతుంది. ఓడిపోయిన వాడికి మరణదండన!"

లోగడ ఆ రాజకుమార్తెను పెళ్ళాడ గోరి వచ్చిన వాళ్ళు చాలామంది ఆమె పరీక్షలకు నిలవలేక మరణదండన పాలయ్యారు. మేడ మీద నిలబడి వున్న రాకుమార్తె సౌందర్యం చూసి ముగ్ధుడైన యువకుడు ప్రాణంపోతే పోతుందనుకుని, ఆమె పెట్టే పరీక్షలకు నిలబడతానని రాజు దగ్గరకు పోయి చెప్పుకున్నాడు.

రాజు అతణ్ణి సముద్ర తీరానికి తీసుకుపోయి, అతడు చూస్తుండగానే ఒక బంగారు ఉంగరాన్ని

సముద్రంలోకి విసిరివేసి, దాన్ని తీసుకు రమ్మన్నాడు.

యువకుడు నీటికేసి పోతున్నంతలో రాజు అతణ్ణి ఆగమని, "ఉంగరం లేకుండా నీటి నుంచి బయటికి వచ్చావో, నిన్ను తిరిగి సముద్రంలో తోయిస్తాను. సముద్రపు నీటిలో నువ్వు మునిగి పోయే వరకూ నిన్ను అలా నీటిలో తోయిస్తూనే వుంటాను, తెలిసిందా?" అన్నాడు.

యువకుడు సముద్రం అంచుకుపోయి ఏమి చేయటమా అని ఆలోచిస్తున్నంతలో సముద్ర జలంలోంచి మూడు చేపలు యీదుకుంటూ అతడికేసి రాసాగినై. ఆ చేపలు మూడూ లోగడ అతడు కాలవ ఒడ్డున రక్షించినవే! వాటిలో మధ్యవుండి యీదుకు వస్తున్న చేప నోట్లో ఒక ముత్యపు చిప్ప వున్నది. అవి యువకుడున్న చోటుకు ఈదుకొంటూ వచ్చి, ముత్యపు చిప్పను అతడి కాళ్ళ దగ్గర పడవేసినై. యువకుడు ఆ ముత్యపు చిప్పను చేతిలోకి తీసికొని, దాన్ని తెరిచి చూసేసరికి లోపల రాజు సముద్రంలోకి విసిరివేసిన బంగారపు టుంగరం ఉన్నది.

యువకుడు పరమానందం చెంది ఆ ఉంగరాన్ని తెచ్చి రాజు కిచ్చాడు. ఇక రాకుమార్తెతో తనకు వివాహం జరిగిపోతుందనే అతడి ఆశ! కాని, రాకుమార్తె అతణ్ణి ఎగాదిగా ఓమారు పరీక్షగా చూసి, తనలాగా అతడు గొప్పవంశం వాడు కాదని గ్రహించి, మరో పరీక్ష పెడతానన్నది.



ఆమె రాజభవనం వెనక వున్న ఉద్యానవనం అంతటా పది బస్తాల నువ్వు గింజల్ని స్వయంగా వెదజల్లి, మర్నాడు సూర్యోదయంలోపుగా వాటిని ఒక్క నువ్వుగింజ బీరు పోకుండా బస్తాలలో నింపాలన్నది.

యువకుడు యీ పరీక్షలో విజయం సాధించటం అసంభవమని తెల్సుకుని, ఉదయానే రాజు విధించబోయే మరణ శిక్ష గురించి ఆలోచించ సాగాడు. గంటలు గడిచిపోయినై. సూర్యోదయం అయింది. తలవంచుకుని రాత్రల్లా విచారిస్తూ కూర్చున్న యువకుడు తలఎత్తి చూసి, ఆశ్చర్యానందాల్లో ఉక్కిరి బిక్కిరై పోయాడు. అల్లంత దూరంలో పది బస్తాలు నువ్వులతో నిండివున్నాయి. ఆ యువకుణ్ణించి

లోగడ సహాయం పొందిన గండుచీమల రాజు ఆ రాత్రికి రాత్రే లక్షల సంఖ్యలో వున్న తన అనుచరులతో వచ్చి, నువ్వు లన్నిటినీ ఏరించి బస్తాల్లో నింపించాడు.

రాజకుమార్తె ఉద్యానవనంలోకి వచ్చి నువ్వుల బస్తాలను చూసి అమితాశ్చర్యం పొందింది. కాని ఆమె హృదయం పాషాణం వంటిది.

ఆమె యువకుడితో, "నువ్వు రెండు పరీక్షల్లో విజయం పొందావు. కాని మరో పరీక్ష వున్నది. సముద్రంలోని ఏదో దీవిలో వున్న చెట్టు నుంచి బంగారంలా మెరిసే అమృత ఫలం తెచ్చి నాకు ఇవ్వాలి. అలా చేయగలిగితే నిన్ను వివాహం ఆడతాను!" అన్నది.

యువకుడు బయలుదేరాడు. అతడొక అరణ్యంలోంచి ప్రయాణిస్తూ, విశ్రాంతి కోసం ఒక చెట్టు కింద కూర్చున్నాడు. హఠాత్తుగా చెట్టు మీదనించి బంగారంలా మెరిసిపోతున్న ఒక పండు అతడి ఒళ్ళో పడింది. అదే సమయంలో మూడు డేగలు అతడి ముందు వాలినై.

"మమ్మల్ని గుర్తించావా? ఆకలితో చావకుండా మూడు డేగ పిల్లల్ని కాపాడావు. ఇప్పుడు మేము పెద్దవాళ్ళం అయాం. నువ్వు బంగారు అమృత ఫలం కోసం వెతుకుతున్నావని తెలిసి, సముద్రంలో వున్న దీవికి ఎగిరి పోయి, యీ ఫలం తెచ్చాం!" అన్నవి డేగలు.

యువకుడు చాలా సంతోషించి పక్షులకు తన కృతజ్ఞత చెప్పుకుని కొద్ది రోజుల్లోనే రాజకుమార్తె దగ్గరకు వచ్చి, ఆమెకు అమృత ఫలాన్ని యిచ్చాడు. అప్పటికి రాకుమార్తె హృదయం కాస్త మెత్తబడింది.. ఆమె అప్పటి కప్పుడే అమృతఫలాన్ని రెండుగా కోసి, సగం యువకుడి కిచ్చి, సగం తాను తిన్నది. వెంటనే ఆమెహృదయంలో యువకుడిపైన ప్రేమ పుట్టు కొచ్చింది. రాజు, యువకుడికి తన కుమార్తె నిచ్చి వైభవంగా పెళ్ళి చేశాడు. వాళ్ళు ఎన్నో ఏళ్ళపాటు సుఖంగా జీవించారు.





# అమూల్యక్షణం

ఒకసారి దుర్వాస మహర్షి గంగానదిలో స్నానం చేసి వస్తున్నాడు. అతడికి మార్కండేయ మహర్షి ఎదురయ్యాడు.

మార్కండేయ మహర్షి చిరునవ్వుతో, "మహా ఋషీ! నేను ఇంతవరకూ చేసిన తపోశక్తిని మీకు ఇస్తున్నాను దయచేసి స్వీకరించండి," అని కోరగా, దుర్వాసుడు దాన్ని సంతోషంగా స్వీకరించి ఇలా అన్నాడు.

మార్కండేయ మహర్షీ! నేను తపస్సు చేస్తూ ఉండగా ఒక రోజున మాత్రం ఒక్క క్షణంలో ఏదో గొప్ప అనుభూతిని పొందగలిగాను. అది నీకు ధారపోస్తున్నాను. తీసుకో!"

మార్కండేయ మహర్షి పరమానందంగా దాన్ని తీసుకున్నాడు.

ఆ తరువాత వారిద్దరికీ, "ఎవరు ఇచ్చింది గొప్పది?" అనే సందేహం కలిగింది.

దుర్వాసుడూ, మార్కండేయుడూ తమ సందేహాన్ని తీర్చుకోవడానికి బయలుదేరారు.

అంతలో వారికి నారదుడు ఎదురయ్యాడు. ఇద్దరూ నారదుడి దగ్గరకు చేరి నమస్కరించారు.

ఆ తరువాత మార్కండేయ మహర్షి, "నారదా! నేను సంపాదించిన తపోశక్తిని అంతా దుర్వాసుడికి ధారపోసాను. అందుకు ప్రతిఫలంగా అతడు తపస్సు చేస్తుండగా ఒకరోజున కేవలం ఒక్క క్షణం తనకు కలిగిన అనుభూతిని నాకు ధారపోశాడు. మా ఇరువురిలో ఎవరు ఇచ్చింది గొప్పది?" అని అడిగాడు.

నారదుడు కొద్ది సేపు ఆలోచించి, "ఈ సందేహాన్ని శివుడు మాత్రం తీర్చగలడని నా వుద్దేశ్యం. కైలాసం పోయి అడుగుదాం రండి," అంటూ కదిలాడు.

ముగ్గురూ శివలోకం చేరారు. మార్కండేయ మహర్షి పూర్వంలాగే జరిగినది అంతా శివుడికి విన్నవించాడు.

శివుడు ఆలోచించి, "ఈ సందేహాన్ని మహా

. బెహరా ఉమామహేశ్వరరావు.

విష్ణువు తీర్చగలడు. అతణ్ణి అడుగుదాం పదండి!" అంటూ స్వర్గానికి బయలుదేరాడు.

నలుగురూ కలిసి విష్ణువుని చేరారు. "ఈ సందేహాన్ని బ్రహ్మదేవుడు నివృత్తి చేయ గలడు. మనమంతా అక్కడికి వెళదాం," అంటూ కదిలాడు విష్ణువు.

వారందరూ కలిసి బ్రహ్మ లోకం చేరారు. బ్రహ్మకు విషయం అంతా చెప్పారు.

బ్రహ్మ ఆలోచించి, "ఈ సందేహాన్ని అనంతుడు మాత్రమే తీర్చగలడు. అతడి వద్దకు వెళదాం, కదలండి, అన్నాడు.

అరుగురూ అనంతుని దగ్గరికి చేరారు. మార్కండేయ మహర్షి తమ రాకకుగల కారణం వివరించాడు.

అనంతుడు వారిని చూచి, ఆనందపడుతూ, "నాతలపై గల భారాన్ని మీలో ఎవరో ఒకరు అందుకోండి క్షణకాలం ఆలోచించి చెపుతాను," అన్నాడు

అక్కడ చేరిన అరుగురు ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. దుర్వాసుడు, మార్కండేయ మహర్షి వైపు చూచాడు.

వెంటనే మార్కండేయుడు ముందుకు వచ్చి, తన తపోశక్తితో అనంతుడి తలపైగల భారాన్ని అందుకున్నాడు.

అనంతుడు అందుకు ఎంతో సంతోషించి "నా తలపై గల భారాన్ని అందుకున్న ఈ క్షణం ఎంతో గొప్పది. నాకు ఇప్పుడు ఆనందంగా ఉంది," అన్నాడు.

క్షణకాలం తరవాత అనంతుడు తన భారాన్ని తిరిగి తీసుకున్నాడు.

అప్పుడు మార్కండేయ మహర్షి వినయంగా దుర్వాసుడికి నమస్కరించి, "మహర్షీ! మీ తపో శక్తిలో మధురానుభూతిని పొందిన క్షణం స్వీక రించిన నేను ధన్యుడను అన్నాడు.

దానితో ఆక్షణం ఎంత గొప్పదో అందరికీ అర్థం అయింది.





# సమతా రాజ్యం

రామాపురం జమీందారు పేరు రాఘవయ్య. అతడు చాలా స్వార్థపరుడు, పేదలపట్ల కొంచెం కూడా దయలేనివాడు. ఆ గ్రామంలోని ప్రజలందరూ రాఘవయ్య భూములు సేద్యం చేస్తూ, పండిన దాంట్లో చాలాభాగం రాఘవయ్యకు సమర్పించి, మిగిలిన దాంతో ఒకపూట తిని, మరో పూట తినక ఎలాగో కాలం గడుపుతున్నారు.

ఆ సంవత్సరం వర్షాలు లేక రామాపురంతో పాటు దాని చుట్టు పక్కల అనేక గ్రామాలలో పంటలుపండలేదు కరువు కాటకాలతో తినటానికి తిండీ, త్రాగటానికి నీరూ లేక ప్రజలు మల మల మాడిపోతున్నారు. జమీందారు దివాణంలో మాత్రం గోదాముల నిండా ధాన్యం నిల్వలు వున్నాయి. రాఘవయ్య అతడి పరివారమూ మాత్రం ప్రజల కష్టాలు ఏమాత్రం పట్టించుకోకుండా, హాయిగా కడుపునిండా తిని తిరుగుతున్నారు.

ఒకనాడు రామాపురం ప్రజలందరూ జమిందారుతో తమ కష్టాలు చెప్పుకుని, తలా కొంత ధాన్యం అప్పుగా ఇమ్మని, తరవాత తమ రెక్కల కష్టంతో ఋణం తీర్చుకుంటామని దీనంగా మొరపెట్టుకున్నారు. కాని, జమీందారు వారికి సహాయం చేయటానికి అంగీకరించలేదు. పైగా, వచ్చిన వాళ్ళ నందరినీ తన మనుమల చేత బాగా తన్నించి పంపించాడు.

అలా తన్నులు తిన్న నిర్భాగ్యులలో గోపయ్య ఒకడు. గోపయ్యకు ఒక కూతురూ, కొడుకు. భార్య చనిపోయింది. అష్టకష్టాలూ పడుతూ పిల్లలిద్దర్నీ పోషిస్తున్నాడు.

గోపయ్య కొడుకు అప్పటికి నాలుగేళ్ళవాడు. వాడు ఆకలికి ఆగలేక విపరీతంగా గోల చేస్తున్నాడు. ఇంట్లో చారెడు బియ్యం కూడా లేవు. గోపయ్యనుమతి ఎంత ప్రయత్నించినా వాడికి పట్టెడన్నం పెట్టే మార్గం కనిపించలేదు.

వక్కలంక రామారావు



చివరకు గోపయ్యా బాగా చీకటి పడ్డాక, జమీందారు భవంతి పెరటి గుమ్మం దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు. జమిందార్లూ, పరివారమూ భోజనాలు చేశాక, వారు బయట పారవేసే ఎంగిలి విస్తళ్ళలో నుంచి పట్టెడన్నం పోగుచేసి తీసుకొని పోవాలని అతడి ఆశ! కాని. గోపయ్యా ఎంతసేపు ఎదురు చూసినా విస్తళ్ళు దివాణం గోడదాటి ఇవతల పడలేదు.

గోపయ్యా దీనంగా కిటికీ తలుపులో నుండి లోపలకు చూశాడు. జమీందారు మనుమలు నలుగురు దీపం దగ్గర చేరి చుట్టలు త్రాగుతూ చీట్లపేక ఆడుతున్నారు. వారికి కొంత దూరంలో జమీందారు పెంపుడు కుక్కలు తమకు పెట్టిన అన్నం ఎక్కువై, కంచాలు దూరంగా నెట్టి తోకలు ఊపుకుంటూ మరో వైపుకు పరుగెత్తాయి. గోపయ్యా అదే సమయమని చప్పుడు కాకుండా గోడ దూకి లోపలకు వెళ్ళి కుక్కలు వదలిన అన్నం జాగ్రత్తగా తన పైబట్టలో కట్టుకున్నాడు. ఇంతలో కుక్కలు భౌ భౌ మంటూ గోపయ్యా మీద పడి అన్నం మూటను లాగేశాయి. జమీందారు మనుమలు గోపయ్యాను పట్టుకున్నారు.

జమీందారు గోపయ్యాను "దొంగవెధవా! గోడ దూకి లోపలకు వస్తావా?" అంటూ నానా తిట్లు తిట్టి, చెట్టుకు కట్టించి, తన మనుమల చేత బాగా కొట్టించి పంపించాడు.

నడవటానికి కూడా ఓపిక లేక గోపయ్యా బాధతో మూలుగుతూ దివాణం నుంచి బయట పడ్డాడు. దారిలో ఒక క్రొత్త మనిషి గోపయ్యాకు ఎదురై అతడి కష్టాలకు కారణం అడిగాడు.

"ఎందుకు బాబూ! మా కథలు మీకు చెప్పటమే కాని మీరు ఆర్చే వారా తీర్చే వారా?" అన్నాడు గోపయ్యా బాధగా.

"ఆర్చేవాణ్ణీ నేనే, తీర్చే వాణ్ణీ నేనే! ముందు ఏం జరిగిందో చెప్పు," అంటూ గోపయ్యా కథ నంతా అడిగి తెలుసుకుని వెళ్ళిపోయాడు. ఆ మనిషి ఎవరో కాదు మారు వేషంలో వున్న ఆ దేశపు మహారాజు ధర్మపాలుడు.

మరునాడే రామాపురం ప్రజలందరికీ ఆహారం అందే ఏర్పాట్లు జరిగాయి. ఆ తరవాత ఆ జమీందారు రాఘవయ్యాని విందుకు రమ్మని మహారాజు నుండి ఆహ్వానం వచ్చింది. విందులో

మహారాజు, రాఘవయ్య సహపంక్తిని భోజనం చేస్తున్నారు. ఇంతలో, హఠాత్తుగా రెండుకుక్కలు వచ్చి రాఘవయ్య భోజన పళ్ళెంలో జొరబడ్డాయి. జమీందారు చిరాకు పడుతూ వెంటనే తన చెయ్యి పళ్ళెంలో కడిగేసుకున్నాడు.

చూడు రాఘవయ్యా! నువ్వు తింటుండగా నీ పళ్ళెంలోని భోజనాన్ని కుక్కలు అంటితే 'ఛీ,ఛీ!' అన్నావు బాగుంది. మరి కుక్కలు తిని పార వేసిన దానికి మనిషి కక్కుర్తిపడితే ఏం చేయాలి? అతడిని చితకతన్ని పంపాలికదూ!?" అన్నాడు ధర్మపాలుడు

మహారాజు తనను ఈ మాటలు ఎందుకు అడుగుతున్నాడో జమీందారుకు అర్థం కాలేదు. ఇంతలో గోపయ్య విలువైన దుస్తులతో వచ్చి, మహారాజుకు నమస్కారం చేసి రాఘవయ్య పక్కనే ఓ కుర్చీలో కుర్చున్నాడు.

"మహారాజా ! నన్ను అవమానించడానికే ఇక్కడకు ఆహ్వానించారా?" అన్నాడు రాఘవయ్య .

"కాదు. నీకు గుణపాఠం చెప్దామనే ఇక్కడకు పిలిపించాను. ఈనాటి నుంచీ ఈ రాజ్యంలో జమీందారీలు రద్దు చేస్తున్నాను. పరిమితి దాటిన భూములను పేద రైతులకు పంచుతున్నాను. వెట్టి చాకిరీకి స్వస్తి చెప్తున్నాను. శాంతి భద్రతల రక్షణకు ప్రభుత్వం అవసరం గనుక నేను రాజుగా ఆ బాధ్యత చూసుకుంటాను. కుక్క కంటే సాటి మనిషి విలువ ఎక్కువని నేటినుంచైనా నీ లాంటి మూర్ఖులు గుర్తిస్తే సంతోషిస్తాను" అంటూ అతణ్ణి సాగనంపాడు మహారాజు.

అనాటి నించీ ఆ రాజ్యంలో జమీందారులు లేరు. సామాన్య ప్రజలు కూడా సమస్త సుఖాలూ అనుభవిస్తున్నారు. మహారాజు కూడా ప్రజలలో తానుకూడా ఒకడై, శాంతి భద్రతలు పరిరక్షిస్తూ, సమతకు మమతకు వంతెన కట్టి తన రాజ్యం పేరు అటుపైన 'సమతారాజ్యం'గా మార్చేశాడు.





# వేదవతి

వింధ్యాటవిలో విమలానందుడనే ఓ మహర్షి వుండేవాడు. అతడు తన ఆశ్రమ ప్రాంతంలోని మునులందరికీ గురుస్థానంలో వున్నాడు. ఐహిక వాంఛలు లేని ఆ ముని వివాహం చేసుకోలేదు.

ఒకనాడు వింధ్యపర్వతం మీదినుంచి ఓ వెలుగురేఖ ప్రసరిస్తూ, తన ఆశ్రమం మీద పడటం చూశాడు ఆ ముని. అతడా కాంతిరేఖ ననుసరించి వెళ్ళాడు. కొండమీదికి చేరుకుని, వెలుగురేఖ ఆవిర్భవించే చోటుకి వెళ్ళాడు. అక్కడొక పసిబాలిక గుక్క పట్టి ఏడుస్తున్నది.

అప్పుడు ఆకాశవాణి 'మునిచంద్రమా! చందమామ వంటి యీ ముద్దు బిడ్డను నువ్వు నీ ఆశ్రమానికి తీసికెళ్ళు. పెంచి పెద్ద చెయ్యి. ఈ సౌభాగ్యవతి వల్ల నీ జీవితం పునీతమౌతుంది. నీకు సద్గతినిచ్చే యీ బిడ్డ, లక్ష్మీదేవిలోని ఓ అంశ.' అని చెప్పింది.

ఆ మాటలు వినగానే విమలానందుడు పరమానందంతో పొంగిపోయాడు. బాలికను తీసుకుని ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. బిడ్డను గురించి అడిగిన వారి కందరికీ తనకు దైవం ప్రసాదించిన దేవత ఆమె అని చెప్పాడు.

ఆ చిన్నారికి విమలానందుడు వేదవతి అని పేరు పెట్టాడు. ప్రత్యేక శ్రద్ధతో పెంచాడు.

వేదవతి యుక్త వయస్కురాలైంది. ఆ యువతికి తగిన వరుణ్ణి తెచ్చి వివాహం చెయ్యాలని నిశ్చయించాడు ముని. ఆ విషయం తెలిసి వేదవతి 'నాన్నా! నాకు వివాహ వాంఛ లేదు. నీ ప్రయత్నం విరమించు' అని చెప్పింది. అందుకు ఆ ముని "నీకు వివాహ వయసు వచ్చిందమ్మా!" అన్నాడు." అయితే, నేను కోరిన వరుణ్ణి తెచ్చి వివాహం చేస్తావా నాన్నా!" అన్నది వేదవతి.

'తప్పకుండా చేస్తాను. ఎటువంటివాడు కావాలో చెప్పు తల్లీ!' అన్నాడు ముని.

'ఇదిగో. ఇటువంటి వాడు' అని వేదవతి శంఖం, చక్రం, గద ధరించిన శ్రీమన్నారాయణుని చిత్రం గీసింది.

'అమ్మా! యిది సాధ్యమా తల్లీ!' అన్నాడు

'ప్రయత్నానికి అసాధ్యమేముంది నాన్నా! తపస్సు చేసి శ్రీమహావిష్ణువును నీకు అల్లుణ్ణి చేస్తాను.' అని చెప్పి, వేదవతి ఓ ఏకాంత ప్రదేశంలో దీక్ష వహించి శ్రీమన్నారాయణుణ్ణి ఆరాధించసాగింది.

వేదవతి గొప్ప అందగత్తె చూపరులకు చిత్త విభ్రాంతిని కలిగించే ఆకర్షణ ఆమెది.

ఒకనాడు రాక్షస సార్వభౌముడైన రావణుడు పుష్పక విమానం మీద ఆ దారిన వెళుతూ వేదవతిని చూసి మోహించాడు. అతడు విమానాన్ని అక్కడ ఆపి క్రిందికి దిగాడు. వేదవతిని సమీపించి, 'సుందరీ! లంకాధీశ్వరుడైన రావణుణ్ణి నేను. నన్ను వివాహమాడి నా రాణులలో ఒకతెవై సుఖించుదువుగాని..రా' అని ఆమె జడ పట్టుకుని పైకి లేపాడు.

వేదవతి విష్ణు ధ్యానం భంగమైంది. ఆ దానవుడు ముట్టుకున్న జడను ఆమె త్రెంచి వేసింది.

'ఓరీ! రాక్షసాధమా! శ్రీమహావిష్ణువు పాద పద్మాలకు అంకితమైన నా శరీరాన్ని నీ పాపిష్ఠి చేత్తో పట్టుకుని మలిన పరిచావు. యిప్పటినుంచి నువ్వు యిష్టంలేని స్త్రీని ముట్టుకుంటే, శిరస్సు వేయి ప్రక్కలై మరణిస్తావు. ఈ మలిన శరీరాన్ని యింతటితో త్యజించి, నీకు మృత్యువునై మళ్ళీ జన్మిస్తాను.' అని రావణుణ్ణి శపించి, హెచ్చరించి వేదవతి తనలో నుండి ఆవిర్భవించిన అగ్నికి ఆహుతి అయింది.

ఆ దృశ్యం చూసిన రావణుడు నిరాశతో వెళ్ళి పోయాడు. విమలుడు వేదవతిని పెంచిన పుణ్యఫలం వల్ల, అంతటితో జన్మరాహిత్యం పొందాడు.

రావణ స్పర్శకు అసహ్యించుకుని, ఆత్మాహుతి చేసుకున్న వేదవతియే, మరు జన్మలో సీతగా అవతరించి రావణ వధకు కారకురాలైంది.





# తాతయ్య ప్రశ్న
# మనవడి జవాబు



నిర్వహణ: అవసరాల రామకృష్ణారావు

అపురూపవతి అనే నగరాన్ని పాలించే సుధీరవర్మ భార్యపేరు శ్యామలాదేవి. ఒకరిమీద ఒకరికి ఎంత ప్రేమ ఉన్నా, వారిద్దరి మీదా ప్రజలకు చెప్పలేనంత భక్తీ అభిమానమూ ఉన్నా, పిల్లలు లేని కొరత వారిద్దర్నీ ఎంతగానో వేధించేది.

శ్యామలాదేవి కాపురానికి వచ్చిన పదిహేనేళ్ళకి ఓ నాటి రాత్రి చిత్రమైన కల వచ్చింది ఆమెకి. అందులో ఆమెనిత్యమూ పూజించే గాయత్రీదేవి ఏదో బోధ చేసినట్టయింది. దానిని బట్టి ఆమెకి తెలియవచ్చిన విషయం ఇది: చిన్నప్పుడు ఆటపాటల్లో ఓ పిల్లి పిల్లను కింద ఎత్తేస్తే అది కాస్తా చచ్చిపోయిందిట. 'కడుపుతీపి గొప్పదనం తెలుసుకోకుండా నువ్వు నా పిల్లను చంపేశావు. పదిహేనేళ్ళపాటు తల్లి హృదయం అంటే ఏమిటో నీకూ తెలియకుండా పోతుందిలే!' అని మార్జాల మాత పెట్టిన శాపం ఆరోజుతో తీరిపోయిందిట.

'ఇంకా చూస్తావేం శ్యామలాదేవీ! మీ పుట్టింటికి ఉజ్జయినికి వెంటనే వెళ్ళు. అక్కడ తోటలో వెలగచెట్టున రెండే రెండు పళ్ళుంటాయి. ఏదో ఒకటి మాత్రమే నువ్వు కోరుకుని తినాలి. రెండూ తింటే వికటించి ఫలితం ఉండదు సుమా!

ఎక్కువ రోజులు చక్కగ బ్రతికే
గణిత విశారద కావాలా?
ఇరవై ఏళ్ళకె కరువై పోయే
ఘన శాస్త్రజ్ఞుడు కావాలా?

పరవశంతో మెలుకువ వచ్చిన శ్యామలాదేవి మర్నాడే ఉజ్జయినికి ప్రయాణం కట్టింది. నిజంగానే వెలగచెట్టున వేలాడుతున్న రెండే రెండు పళ్లని చూసి గాయత్రికి నమస్కరించింది. ముఖ్యసఖీ దూరపు బంధువూ అయిన పార్వతిని వాటిని కోయించి తెమ్మంది. అలా తీసుకురావడంలో ఏ పండు ఎటువైపుదో పార్వతి చెప్పలేకపోయింది. ఒకటి తీసుకుని కళ్లకద్దుకుని భుజించి

రెండోది పార్వతి ఆరగించిందని ఆమె ఎరగదు! అంతటి తృప్తిలోనూ శ్యామలాదేవికి గాయత్రీదేవి హెచ్చరిక గుర్తు ఉండనే ఉంది. 'ఈ కలలోని కమ్మని కబురు మరెవరికీ చెప్పకూడదు. చెబితే, పుట్టిన బిడ్డకు పెళ్ళికాదు. ఆపని మానవ మాత్రులెవరూ చెయ్యలేరు.'



ఒకప్పుడు ఎన్ని చికాకులకు లోనయితేనేం శ్యామలాదేవి కిప్పుడు చక్కని చుక్కలాంటి పదహారేళ్ళ కూతురు. ఆ చుట్టు పట్లనున్న రాజకుమారు లందరికీ ఆమె ఓ అందరాని చందమామ. ఎందుకంటే వారిలో ఏ ఒక్కర్నీ పెళ్లాడ్డానికి మాత్రం ఆమె సిద్ధంగా లేదు. పుట్టుకతో వచ్చి

వయసుతో పెరుగుతున్న ఆ లెక్కలమీద మక్కువ చూసి ఆమె నందరూ 'గణిత విశారద' అంటూ పిలవ జొచ్చారు.

ఈ చిక్కు లెక్కల చిన్నారికి ఇరు పక్కలా ఇద్దరు చెలికత్తెలు తోడుగా దొరికారు. మొదటి సఖిపేరు చికిలింత. ఓసారి ఇష్టాగోష్టిలో శారద ఓ చిత్రమైన ప్రశ్న వేసింది.

ముగ్గురు దొంగలు బోలెడు ధనం దోచుకుని దొరికిందంతా కొన్ని బస్తాలలో శకటాల మీద తరలించుకు పోతూంటే ఓ నది అడ్డొచ్చింది. ఒడ్డునున్న మూడు పడవల్లో బస్తాలు సర్దుకుని నది దాట బోతూంటే ఒకటో దొంగ తన పడవ మునిగి పోతోందనీ ఎన్నో కొన్ని రెండోవాడి పడవ మీదికి తర్లించి తీరాలనీ గొడవ చేశాడు. తన పడవలో ఎన్ని బస్తాలున్నాయో అన్నిటినీ రెండో దొంగ వేసుకుని దాటబోతూంటే తనకే భారమనిపించి గోల చేశాడు. మూడో దొంగ తన పడవలో ఉన్నన్ని మాత్రమే స్వీకరించగలిగాడు. ఇప్పుడు అన్ని పడవల్లో బస్తాలూ సమానం. మొదట్లో ఎన్ని?

ఈ ప్రశ్న శ్రద్ధగా వింటున్న ఓ మెరుపు కళ్ల సుందరి ఇట్టే జవాబు చెప్పి శారద చేత 'సెభాష్' అనిపించుకుంది. ఆ చమత్కారి పేరే చికిలింత.

(ఇంతకీ చికిలింత చెప్పిన జవాబు ఏమిటి? బస్తాలు ఎన్నెన్ని?)

(దొంగభడవల పడవలలోని బస్తాల సంఖ్య వరసగా ఏడూ, మూడూ, రెండూ)

జవాబు:



Edited and published by Vijaya Bapineedu, 80, Dhanalaxmi Colony, Madras-26, Phone : 422233 and Printed by N. Navin Chandran at S. R. Offset Art Printers, Madras-21. Phone : 552462.